# వెలను పరిశీలించండి.
# గుణమును పరీక్షించండి.

## పాయింట్

అతి నాణ్యమైన బట్టల సబ్బుపొడి




వెల పట్టి

పన్నులు చోటునుంచి చోటుకి వ్యత్యాసం ఉండుగనుక ప్యాక్‌మీద చూపబడిన వెలకు పన్నులను చేర్చలేదు. హైదరాబాద్‌లో అమ్ముడు వెలలను (పన్నులు చేర్చి) ఈ క్రింద ఇవ్వబడినవి—శ్రేష్ఠమైన సబ్బు పొడిలతో పోల్చగల పాయింట్ అప్పటికి తక్కువ ధర గలది.

| పాయింట్ | 750 గ్రాం | 550 గ్రాం | 200 gm |
|---|---|---|---|
| ప్యాక్ వెల (పన్నులు లేక) | 8.90 | 6.80 | 2.63 |
| మీరు ఆఖరుగా ఈయవలసిన వెల (పన్నులు చేర్చి) | 9.33 | 7.13 | 2.76 |



గవర్నమెంట్ సోప్ ఫ్యాక్టరి,
బెంగుళూరువారి ఒక శ్రేష్ఠమైన ఉత్పత్తి



సురేష్
ప్రొడక్షన్స్

పట్టుకొన్న మట్టిని బంగారంగా_
కట్టుకొన్న ఆలిని ప్రాణంగా చూసుకొనే మగాణ్ణి

# సోగ్గాడు

ఈస్ట్మన్ కలర్

నిర్మాత: డి. రామానాయుడు

దర్శకత్వం: కె. బాపయ్య









ఆంధ్ర-సీడెడ్: నవయుగ

నైజాం: విజయా సురేష్ పిక్చర్స్

NVKR

పనిలేని వేళల్లో బాతాఖానీ
కొట్టకండి అది దేశానికి నష్టం








**ఆంధ్రసచిత్రవారపత్రిక**

వ్యవస్థాపకులు
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు
స్థాపితం : 1908
శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు
(1938 - 1972)

శుక్రవారం : 2-1-'76
రాక్షసనామ సం. పుష్యమాస శు. పాడ్యమి
*సంపుటము : 69 సంచిక : 17*

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

★

సంవత్సర చందా - రు. 33-80
ఆరుమాసాల చందా - రు. 16-90
విడిప్రతి వెల 60 పైసలు
ఆంధ్రపత్రిక కార్యాలయము
గాంధీనగరం, విజయవాడ-520003.

## విషయానుక్రమణిక

# ఉత్తరాలు

### హాస్య చక్రవర్తి

"మరపురాని హాస్యమూర్తి రేలంగి" స్వర్గస్థులయారన్న మాట ఆంధ్ర ప్రేక్షకలోకాన్ని విషాదంలో ముంచేసింది. శ్రీ వీరాజీ అన్నట్టు తెనుగువాడు గర్వంగా ప్రపంచానికి చాటి చెప్పుకో గల మహానటుల్లో రేలంకి ఒకరు. ఆయన బతికుండి కూడా సినిమాల్లో వెయ్యలేకపోతేనే బాధపడే ప్రేక్షకులకు ఇక ఆయన లేడన్న వార్త ఎంతటి దుఃఖం కల్గించిందో! ఆయన హాస్య చక్రవర్తే! చివరికి ఫోటోలో చేరి తన విషాద వార్తను దాచేశాడు!

చేబియ్యం లక్ష్మీనారాయణ, (తిరుపతి)

### సీరియల్

మీ, మా పత్రికలో వెలువడే "శ్రావణ సంధ్య" సీరియల్ చదివాను. ఓహ్, చాలా గొప్పగా ఉంది. దానిని గురించి రాసే దానికి, నేను కవిని కాకపోతినే అని చాలా బాధపడ్డాను. మా, మీ పత్రిక కోసం, నేను శరదృతు వెన్నెల కోసం ఎదురు చూచే చకోర పక్షిలాగా ఎదురు చూస్తుంటాను. పైది మీరు నమ్మండినమ్మకపొండి. శ్రావణ సంధ్య రచయితకు ప్రచురించిన మీకున్ను, నా మనసారా, హృదయ పూర్వకంగా, కృతజ్ఞతలు తెల్పుకుంటున్నాను.

మీ, మా పత్రికలో కథలు, సీరియల్సు, బ్రహ్మాండంగా ఉన్నాయి. పత్రికలో, సినిమా శీర్షిక హైలెట్.

జి. వి. రావు, (యరగుంట్ల)

* * *

19.12.75 సంచికలో ముగించిన, "శ్రావణ సంధ్య" సీరియల్ చాల బాగుంది! రఘునాథ్ లాంటి స్వార్థపరుల కబంధ హస్తాలలో నలిగి పోయిన మల్లెపూవులాంటి శాంతి, తన స్వార్థాన్నే చూసుకోలేక తాను చనిపోతే ఉన్న భర్త, బిడ్డ ఎంత నికృష్టమైన జీవితం సాగిస్తారో వూహించుకోలేక ఎటుకలనుండుటతో అంటురు ఈ పాపపు పుట్ట అయిన లోకం నుండి కలిసి చనిపోవడం ఎంతైనా సముచితమేనేమో మరి! వూహించని విధంగా కథ ముగించిన రచయితకు మా హృదయ పూర్వక ధన్యవాదాలు!

ఎస్. రమేష్, జి. కృష్ణ, (మిట్టపల్లి.)

* * *

శ్రావణసంధ్య సీరియల్ చాలా బాగుంది. రచయితకు అభినందనలు.

బి. ఎల్. శాస్త్రి, (భీమవరం)

### సినిమా

మీ వీక్లీలో సినిమా న్యూస్ అయిటం మమ్మల్ని చాల బాధపెట్టింది. మహాకవి క్షేత్రయ్యలో నన్నయభట్టుగారు పోయినాక భారత పూర్తి చేసేందుకు రాజరాజనరేంద్రుడు భటులను పంపిస్తే తిక్కనగారిని వెతికి తీసుకొచ్చినట్లు వ్రాశారు. నాకు తెలిసినంతవరకు నన్నయగారికి తిక్కనగారికి మధ్య 200 ఏండ్లు తేడా ఉన్నది. ఈ సినిమా వాళ్ళు--సినిమాలు చూచేవాళ్ళు, సినిమాను గురించి చదివే వాళ్లకు అసలు లోకజ్ఞానం గని, చరిత్ర జ్ఞానం గాని లేదనుకుంటారా అనిపించింది. పూర్తిగా ఎస్కేపిజం పిక్చర్స్ అయితే, లేక ఫాంటసీ అయితే ఈ ప్రశ్న రాదు. చరిత్రకు సంబంధించినంతవరకు పాత్రల యొక్క స్వభావాన్ని గురించి ఎట్లా పోర్ట్రేట్ చేసినప్పటికి కాలాన్ని అన్నా కనీసం కొంతవరకు కరెక్ట్‌గా చూపిస్తే బాగుంటుంది.

రామానందవిఠల్, (హైదరాబాదు.)

### అట్టమీద బొమ్మ

అప్పుడప్పుడు మన పత్రిక వేసే ముఖపత్రాలు చాలా బావుంటున్నాయండీ! ఒకసారి మీరెప్పుడో (27.9.74 దనుకుంటా) కృష్ణకుమారి చిత్రం వేశారు. ముఖపత్రం మీద. ఎంత బావుందనీ పవిత్రత ఉట్టిపడుతూ! దాన్ని వెనువెంటనే పోటో గట్టించేశాం. మళ్లీ అంత చక్కని ముఖపత్రాన్ని మొన్న 19.12.75 సంచిక మీద చూశాం. కళాత్మకంగా, శోభాయమానంగా ఉన్న ముఖపత్రం మీద రాజా, రాధారెడ్డిగారలు సజీవంగా కనిపిస్తున్నట్టయి ఒకటికి రెండు సార్లు చూడకుండా ఉండలేకపోయాను.

కథల విషయానికి పోతే ఆరు నిమిషాల కథ 'సెతిఖరీదెంత?' హో మాదిరిగా ఉంది.

"రాలిన ముత్యాలు" కొన్ని చేసిన ముత్యాల్లా ఉంటున్నాయి. "ప్రశ్నావళి" మొదట్లో బాపుం దేది (అంటే అర్థం తెలుసుగా) 'నమ్మా నమ్మకపో' నిశ్చయంగా ఒక మంచి శీర్షికే! " నమ్మా నమ్మకపో (డి)

శకుంతలారమేష్, (ఏలూరు.)

* * *

శ్రీ రాజారెడ్డి, మరియు శ్రీమతి రాధారెడ్డి గార్ల ముఖచిత్రంతో వెలువడిన 19.12.75 పత్రిక చాలా బాగుంది. కేవలం సినిమారంగానికి చెందిన వ్యక్తులనే గాక, ఇతరత్రా అన్ని రంగాలక చెందిన వ్యక్తులను ముఖచిత్రాలుగా మీరు వేయ గలరని మనవి చేస్తున్నాను.

బి. భాస్కరశాస్త్రి, (భద్రాచలం.)

## మనలో మాట

**1975** వెళ్లిపోయింది. 1976 ఆంగ్ల సంవత్సరాది సందర్భంగా అందరికీ మా శుభాకాంక్షలు.

* * *

పోయిన సంవత్సరంలో రెండేసి వారాల కథలు, నాలుగైదు వారాలు పడ్డ కథలు మినహాయించి, బాగా పెద్ద సీరియల్ కథలనే లెక్కకి తీసుకుంటే మొత్తం ఎనిమిది పడ్డాయి. మొదటిది అహం అనురాగం. 1974 డిశంబర్‌లో ప్రారంభం కాగా చివరిది 'మనుగడలో మలుపులు.' 75 డిశంబర్‌లో ప్రారంభమై కొనసాగుతున్నది. ఈ ఎనిమిది మంది రచయితలలో శ్రీమతులు పరిమళా సోమేశ్వర్, పోల్నాపగడ రాజ్యలక్ష్మి (గజమేడ) మాత్రమే రచయిత్రులు. తతిమ్మా ఆరు గురు: 'రంగులవల' (పాలడుగు వేంకటేశ్వర రావు) శమంత హేమంత (పి. వి. ఆర్. శివకుమార్), ఈ సంఘంలో కుటుంబమే ఇది (అన్నపూర్ణ), రాగవీచికలు (అదూరి వేంకట సీతారామమూర్తి) శ్రావణసంధ్య (తాళ్ళూరి నాగేశ్వర రావు) మనుగడలో మలుపులు (జి. రామచంద్రమూర్తి). వీరిలో శ్రీ పాలడుగు, శ్రీ తాళ్ళూరు తప్ప తతిమ్మా వారికి ఈ నవలలే తొలిసీరియల్ రచనలు.

పైన చెప్పిన సీరియల్ కథలన్నీ ఒక్కొక్కటి 8 వారాలు లేదా అంతకుపైగా ధారావాహికంగా వెలువడినవి. ఇవిగాక పెద్ద కథలు చాలా పడ్డాయి. ఇలా లెక్కలు తీయడం రచయితల గురించి, రచనల గురించి విశేషాలు సేకరించటం సరదావున్న మా పాఠకులకోసం యీ వివరాలు పేర్కొన్నామేతప్ప వేరే ఏమీ లేదు.

* * *

సంక్రాంతి సంచికలో యీసారి ఎప్పటివలె ఫిలిప్స్ బ్యాలట్ పత్రం వేయాలనుకుంటున్నాము.

* * *

ఉత్తరాల శీర్షికకు వ్రాసేవారు కొందరు ఇంగ్లీషులో వ్రాస్తున్నారు. మరి కొందరు ఒకరితరపున మరొకరు వ్రాస్తూ, ఫలానివారి తరపున; అనుమతితో అంటూ కూడా వ్రాస్తూంటారు. అటువంటి లేఖలను వేయటం సాధ్యం కాదు. అని మనవి.






*సీతారామ్ప్రసాదు గురించి యెవరైనా పెద్దగా అనుకున్నారా? అనుకోలేదు, అనుకోరన్న ధీమా వుండబట్టి ఒకోసారి అతను చాలా తేలిగ్గా మాట్లాడేస్తుంటాడు. "పోదూ - వాడేం చేసాడు?" అని ప్రజలు బ్రహ్మరథం పట్టిన వాడినే చులకన చేసిన రోజులు లేకపోలేదు.*

అతగాడికి యిష్టమైనవి చాలా వున్నాయ్. అలా యిష్టం కావడానికి కారణాలూ వున్నాయ్. ఉదాహరణకు — ఆఫీసులో తను రాసిన ప్రతి డ్రాఫ్టూ ప్రేమలేఖే అనుకుంటాడు. దానికి కారణం తన జీవితంలో ప్రేమలేఖలు రాసే కవిత్వం అబ్బినా రాసే అవకాశం దొరకలేదు. అతనికి తెలుగు సినిమాలంటే పరమ ప్రీతి దానికి కారణం తన భార్య కురూపి. అందమైన అమ్మాయిలను చూస్తే సరదా. అందులో ఆ అమ్మాయి గుణవంతుడైతే మమకారం. కారణం? ఉన్న ఒక్క కొడుక్కీ తన వుంగరాల జుట్టుగానీ, హుందాయైన గొంతుకానీ, తనలోని ఒక్క సుగుణంగానీ అబ్బలేదు.

తన క్రింద గుమాస్తాగా చేరిన దుర్గాప్రసాద్‌లో తన కొడుకెలా వుండాలని కాంక్షించాడో అన్ని గుణాలూ, అలాంటి రూపూ వున్నాయ్. దుర్గాప్రసాద్ జీతం అందుకోగానే తండ్రికి మనియార్డరు చేసాక తను ఖర్చు పెట్టుకుంటాడు. ఆఫీసు టైముకు అయిదు నిమిషాలు ముందే వస్తాడు. అవసరమైతే గంట, అరగంట ఆలస్యంగా వెళ్ళడానికి వెనుకాడడు. నేర్చుకోవాలన్న పట్టుదల వుంది. అందుకే దుర్గాప్రసాద్ చేరిన

మూడు నెలలకే ప్రభుకు అతనిమీద పుత్ర వాత్సల్యం కలిగింది. ఏడాదిలో దుర్గాప్రసాద్ లేకపోతే ఆఫీసులో యే పనీ జరగదన్నంత అభిమానం యేర్పడింది. తను యిచ్చే చనువును పిసరంతయినా స్వంతంకోసం వినియోగించుకోలేదు. పొటీలు పొరపాటునైనా చెప్పలేదు.

అలాంటి దుర్గాప్రసాదేనా యింత పని చేస్తున్నది? తన చెవిలో యీ విషయం ముందుగా వేస్తే యెంత బాగున్ను? ఎంతో కోపం వచ్చాక యిందులో అసలు నిజమెంతో అబద్ధం యెంతో తెలుసుకుందామని యిక్కడా అక్కడా వాకబు చేసాడు. ఈ కుర్రాడ్ని గట్టి బంధం పడకముందే రక్షించాలి. రమామణి శలవు పెట్టే సుదినంకోసం కానుక కూర్చుంటే ఆ బంధం గట్టి బంధమైతే విడపించటం కష్టం. ఒకనాడు దుర్గాప్రసాద్‌ని అందరూ వెళ్లిపోయాక ఆఫీసులోనే వుండమన్నాడు. ఏవో ఫైళ్లు అడిగి వాటిగురించి చర్చిస్తూ.

"దిగులుగా కనిపిస్తున్నావు. నీ ఆరోగ్యం బాగాలేదా? లేక మీవూర్లో మీవాళ్ల కెవరికైనా...?"

"అబ్బే – అంతా బావున్నారండీ."

"నిద్దర సరిగ్గా లేనట్లు నీ కళ్లు చెప్తున్నాయ్. ఏ నిర్ణయానికి రాలేని ఆలోచనలతో నిద్ర పట్టడంలేదా?"

దుర్గాప్రసాద్ తలదించగానే తనది పైచెయ్యి అయ్యిందని ప్రభు తలెత్తి "పెళ్లాన్ని యెంచుకున్నప్పుడు చాల జాగ్రత్త అవసరం. అందమైనవాడివి. నీకో అందమైన పెళ్లంవస్తే చూసి సంతోషిద్దామన్న వారిలో నేనొకడ్ని? మరచిపోకు"

ఇన్ని మాటలని ఒక చిరునగవు విసిరి "అబ్బే-అబ్బే నీ స్వవిషయంలో జోక్యం చేసుకుంటున్నానెందుకని అభిమానం చంపుకోలేక మా అబ్బాయికి చెప్పినట్లు యీ రెండు మాటలూ అన్నాను నీ యిష్టం."

దుర్గాప్రసాద్ "వస్తాను సార్" అని అక్కడనుంచి వెళ్లిపోయాడు. రమామణి ఆఫీసులోచేరి రెండు నెలలు కాలేదుగానీ యీ మంచివాడ్ని యే మందో మాకో పెట్టి లొక్కుంది అనుకున్నాడు ప్రభు. ఆమరుసటి రోజు దుర్గాప్రసాద్ ఆఫీసుకి రాలేదు. ఇంట్లో పెళ్లాం యెదరగా ఉపన్యాసం యిచ్చాడు.

'ఈకాలం పిల్లలకు యెవరు చెప్పగలరు? ఏంచూసి పడిపోయాడో? ఒక అందమా? ఒక చందమా?"

"ఆ అమ్మాయిలో ఏం చూశాడో?"

"ఈ అమాయకుడ్ని ఆ అమ్మాయి ఇలా దోచేయటం బాగాలేదు. కాస్త సిగ్గుతో వుంటే అందంగానీ......"

ఆ మరుచటి రోజు దుర్గాప్రసాద్ నుంచి వారం రోజులకు శలవుచీటీ వచ్చింది. తరవాత తన వూరు వెళ్లాడని తెలిసింది.

"నా కొడుకే కొరకరాని కొయ్య అనుకుంటే... అంతా యింతే- ఈ తరంవాళ్లని కంట్రోలు చెయ్యటం బ్రహ్మతరం కాదు" అన్నాడు పెళ్లాం యెదరగా.

తన పెళ్లంలో యీ వినేగుణం తనకు నచ్చింది కాబట్టి ఆఫీసు పని కాగానే సరాసరి యింటికొస్తాడు. వంట యింట్లో ఆవిడ వున్నా, యిలా చెప్పకుంటే 'మ్యావ్‌మ్యావ్" అనే పిల్లిలా ఆమె వూ కొట్టుంది కాబట్టి ఆడగి యేవాడూ పులి కాలేదని అతని ధీమా.

దుర్గాప్రసాద్ నెల రోజులకు శలవు పొడిగించగానే ఆ పని రమామణి చెయ్యవలసి వచ్చింది. వారం రోజుల్లో యీ అమ్మాయి ఆ సీటు పనంతా కుణ్ణంగా తెలిసినట్లు చెప్తోంది. ఈ కాలం బిఏ బోడి బిఏ అనుకున్న తన ధృఢ నమ్మకాన్ని మార్చుకోవలసి వచ్చింది. ఈ అమ్మాయి రాసి పెట్టిన కొన్ని డ్రాఫ్టులు నిజానికి నమూనాలు క్రింద పెట్టుకోవచ్చు. ఆమె అందం నచ్చకపోయినా ఆమె పనితనం నచ్చింది. ఆ అమ్మాయి స్వయంగా ఫైళ్లలోని విషయాలను స్పష్టీకరణ చెయ్యడానికి తన ఆఫీసు గదిలోనికి వస్తోంది.

"ఇంతకుముందు యింకే ఆఫీసులోనైనా పని చేశావా రమామణీ?" ప్రశ్నించాడొక రోజు.

"లేదండీ"

"ఇంత బాగా రాస్తున్నావ్?"

"మా నాన్నగారు నేర్పించారండీ"

"ఆయనదీ గవర్నమెంటు సర్వీసేనా?"

"తాలూకాఫీసు హెడ్ గుమాస్తాగా రిటైరయ్యారు"

"అలాగా" అని ఆ రోజుకు చాలించి యింకోరోజు యేదో అడుగుదామనుకుంటే రమామణే అంది.

"మీ యింట్లో అమ్మాయిలు లేరా?"

"నాకు కూతుర్లు లేరు" సంతోషంగా నవ్వుతూ అంటే "పాపం! కోడలైనా లేదా?"

"ఏం? అలా అడుగుతున్నావ్?"

"మీ కోటు బొత్తాలు వూడినా యెవరూ కుట్టలేదే, మీ టై మాసినా కాస్త సర్ఫులో వేసి వుతకలేదే- మీ పొరుగునే వుంటే నేను యీ పనులన్నీ చేసిపెట్టే దాన్ని" అన్న రమామణి యింకోనాడు అట డొక్కు టేబిలుమీద పెట్టూ "మా నాన్నగారికి కోవాబిళ్లలంటే యెంతో యిష్టం. నేనే చేసాను. మీకూ యిష్టమని తెచ్చాను"

"మీ నాన్నగారు రిటైరైనా కోవా బిళ్లలు తింటున్నారా?"

"ఆయనది యెంతమంచి ఆరోగ్యమో?



ఇప్పటికీ రోజుకు రెండు మైళ్లు షికారెళ్తారు. అందర్నీ నవ్విస్తారు. అతను లేకపోతే యింట్లో ఓ క్షణం వుండలేం."

తన తండ్రి సుగర్ కంప్లయింట్‌తో పోయాడు. అంచేతే ప్రభుకు సుగర్ అంటే భయం. ఈ అమ్మాయి యిలా తేవటం తనకు యిష్టంలేదు. ఆ అమ్మాయి అన్న కొన్ని మాటలూ తనకు చేదుగా వున్నయ్. అందుకే తేలిగ్గా అన్నాడు.

"అంత మంచి నాన్న — మరి నిన్ను పెళ్లి చెయ్యకుండా ఉద్యోగంలో యెందుకు పెట్టాడు ?"

"నాకు యిష్టమని సరేనన్నాడు. ఎవరి విశ్వాసాలు వాళ్లకుంటాయి కదండీ ? ఇక మీకు తెలియని మార్కెట్ కనగకా ... "నిట్టూర్చి" నష్టం చెయ్యమంటారు ? మా నాన్ననేం చెయ్యమంటారు ?"

"తాలూకా ఆఫీసు హెడ్ గుమాస్తాగా వున్నప్పుడైనా ఒక చెయ్యి చాపితే..."

"ఛీ ఆ అవినీతికి పోలేదు కాబట్టే అంతా హాయిగా బతుకుతున్నాం. విశ్వాసంతో వున్నాం."

"అంతా అంటే..."

"మా అమ్మ నాన్న. ఇద్దరు తమ్ముళ్లు ఒక చెల్లెలు."

"ఇంకా యింత బరువుందీ ?"

దుర్గాప్రసాద్ మెడికల్ సర్టిఫికేటు పెట్టి యింకో నెల సెలవు పొడిగించాడు. "ఇది బోగస్ సర్టిఫికేట్" అని చిన్న అలజడిచేసి ఆ అభిమానం అంతా యెటో ఒకవేపు వర్షించాలిందా — రోజుకు రోజూ రమామణి పని తనంచూసి "ఈ అమ్మాయి వెరివేషాలేమీ వెయటంలేదు. దుర్గాప్రసాద్‌లా అలాగే సార్ అని గంగిరెద్దులా తలాడించటంలేదు. తను ఏకీభవించనిచోట వాదించి నెగ్గుకొస్తోంది. ఈ అమ్మాయికి తనకన్నా మంచి గ్రహణశక్తి, భాషపై అధికారం, మంచి చెడ్డలను బేరీజువేసే పజ్ఞ ఉన్నాయి ... ఇలాంటి గుణాలున్న కూతురే తనకు ఉంటే?"

రానురాను రమామణి తన తండ్రిమీద యింట్లో యెంతటి శ్రద్ధ తీసుకుంటుందో ఆఫీసులో తనమీద అంత శ్రద్ధా తీసుకుంటే ... దుర్గాప్రసాద్ శెలవునించి వస్తే ఆరోజు తను కోరకుండా యిచ్చిన సలహా పాటించవద్దని చెప్దామనుకున్నాడు.

ఒకరోజు. ఇంకా దుర్గాప్రసాద్ సెలవు

## ఆకాలపు మనిషి

నించి రాలేదు. లంచి టైము. రమామణి ఒక్కర్తే ఆఫీసుగదిలో వుంది. టెలిఫోను ప్రభు గదిలో మోగింది. ఫైలు అవసరం వచ్చి ఆఫీసు గదిలోనికి వెళ్తే ఆమె యేడుస్తోంది మెల్లగా. అతనిని చూసినా ఆ కన్నీరు జలజలా యింకా రాలిపోతునే వుంది.

"ఏం జరిగింది ?" ప్రశ్నించాడు. ఆమె మాటాడలేదు. ఇంతమంది మగవాళ్ల మధ్య ఒక ఆడది. ఎవరేమన్నారో ? ఒక గంట పోయాక ఆమెను తన గదిలోనికి పిలిచి.

"నీ స్వవిషయమైతే చెప్పమని బలవంతం చెయ్యను. ఆఫీసులో యెవరైనా అసభ్యంగా ప్రవర్తించినట్లయితే నిన్ను రక్షించే బాధ్యత నాకున్నది. సంకోచించకుండా చెప్పు" అన్నాడు.

ఆమె మాటాడకుండా తల వంచుకుని తిరిగి వెళ్లిపోయింది. ఆ మరుసటి రోజు శెలవుచీటీ వచ్చింది వారం రోజులు పొడిగించింది. వారం పదిహేను రోజులైంది. ఇద్దరి పని యెవరు చేస్తారు ? ఈ కాలం వాళ్లకు పెళ్లి జుత్తులోకావు మెదడులో వుంటాయని వినుక్కుంటే ఒక వార్త వచ్చిపడింది.

> ### చంద్రునిపై గాలిలో పాదరసం
>
> చంద్రునిమీద పాదరసం ఆవిరులు గల వాయువు సన్నగా వీస్తుండివుంటుందని సోవియట్ శాస్త్రవేత్తలు భావిస్తున్నారు. లూనార్ లూనార్-20 అంతరిక్ష నౌకలు భూమికి తెచ్చిన చందుని నేలమన్నుల్ని పరిశీలించగా, లూనార్-20 తెచ్చిన మన్నులో పాదరసం ఎక్కువ కనిపించింది. ఆ మన్ను ఆ గోళంలోని ఖండభూభాగం నుంచి తెచ్చినది. మన్నులో కనిపించిన ఈ పాదరసం తేడా గాలివలన సంభవించిందని సోవియట్ శాస్త్రవేత్తల అభిప్రాయం. చంద్ర దినభాగంలో 150 డిగ్రీల వేడిలో పాదరసం ఆవిరియై గాలిలో ఖండభాగాలకు చేరి రాత్రులందు చల్లబడి రాళ్లల్లో స్థిరపడుతూందని వారి వూహ.

వార్తకాదు — దుర్గాప్రసాదు బదలి ఆర్డరు వచ్చిపడింది. ప్రభు వాడు కృతఘ్నుడని వాడి ముఖమే చూడదలచుకోలేదు. తనతో చెప్పకుండా యే పెద్దవాడినో పట్టుకొని బదిలీ చేయించుకున్నాడు. రిలీవింగ్ ఆర్డరు వాడి శలవు యెడ్రస్‌కే పంపాకే నిద్దర పట్టింది.

రమామణి వస్తే దుర్గాప్రసాద్ యెంతవాడో చెప్దామనుకున్నాడు. ఇద్దరూ పెళ్లి చేసుకుంటున్నారన్న చిన్న పుకారు విని గాబరా పడ్డాడు. ఆ అమ్మాయి శలవునించి తిరిగి వస్తేనా "అలాంటి చాపకింద నీరులాంటి మనిషితో వేగలేవు. వద్దు వద్దు" అని చెప్పడానికి? కొద్ది రోజుల తరవాత ఆ అమ్మాయికి పెళ్లయిపోయిందని కూడా తెలిసింది. ఆవేళ భార్యతో "ఆ మెల్లకన్ను పిల్లకి పెళ్లయిపోయిందటే !"

"ఏ మెల్లకన్ను పిల్లండీ?"

"రమామణి"

"మెల్లకన్ను సిరి లెండి" అంది.

అసలు కినుకు పూర్వోనే పెళ్లిచేసుకుని కనీసం ఆశీర్వదించండని తనను పిలవలేదు కదా— కనీసం ఆఫీసులో నలుగురుకి పంపినట్లు తనకి ఒక శుభలేఖ పారేయకూడదూ?

వీళ్లిద్దరూ తన రక్త సంబంధీకులా యేమిటి అనుకుని ఆ ముఖాలను మనసు నించి చెరిపేయడానికి ప్రయత్నించాడు. కొన్నాళ్లకు మరచిపోయాడు. ఒకరోజున ఒక కవరు వచ్చింది. అది విప్పి చూస్తే ఆ చేతి వ్రాత బాగా పరిచయమున్నదే... క్రింద సంతకం చూశాడు "దుర్గాప్రసాద్". అది తనకు రాయలేదు. రమామణికి రాసిన వుత్తరం. ఈనాడు కాదు — ఆనాడు ఆఫీసులో మధ్యాహ్నం ఒంటరిగా ఆమె యేడ్చినాడు ఆమె అందుకున్న వుత్తరం— పాత ఉత్తరం. చదివాడు.

"రమా! నిన్ను తప్పక పెళ్లి చేసుకుందామనుకున్నాను. నన్ను కన్నకొడుకుకన్న మిన్నగా చూసుకుంటున్న ప్రభుగారికి మన యిద్దరి పెళ్లిససేమిరా యిష్టం లేదు. నేను గౌరవించేవాళ్లలో అతను ముఖ్యుడు. అతనికి యిష్టంలేనిపని చేస్తే బాధ పడ్తాడు. అందుచేత నన్ను మన్నిస్తావనుకుంటాను. నా ముఖం మళ్లీ యెలా చూపగలను ?

దుర్గాప్రసాద్"

సీతారామప్రభువు చదివి కళ్లు నులుపుకున్నాడు.

# మీ పిల్లలకు అవసరం పుష్టికరమైన ఆహారం మీ పైర్లకు అవసరం విజయ్



పిల్లలు ఆరోగ్యంగా వుండాలంటే పుష్టికరమైన ఆహారాన్నివ్వాలి. అట్లాగే పైరు మొక్కలకు నత్రజని, భాస్వరం, పొటాష్‌లతో కూడిన పోషక పదార్థాలు అందజేయాలి. అప్పుడే పంటదిగుబడులు బాగుంటాయి, రాబడి ఎక్కువౌతుందికూడా.

ప్రస్తుతం ఎరువుల ధరలు పెరిగిపోయిన మాట వాస్తవమే. అందుచేత ఖర్చులు తగ్గించుకోడానికి పైర్లకు యూరియా మాత్రమేవేస్తే సరిపోదాఅని మీలో కొందరు అనుకోవచ్చు. కాని యూరియా మాత్రమే వేస్తే...పైరు మొక్కలలో చీడలు, తెగుళ్ళ నిరోధక శక్తి తగ్గిపోతుంది. అంతేకాదు పైరు నీటి ఎద్దడిని తట్టుకునే శక్తిని కూడా కోల్పోతుంది. భూసారం కూడా క్రమేణా తగ్గి పంటదిగుబడులు క్షీణించిపోతాయి.

భాస్వరం, పొటాష్‌లు వాడినపుడే మొక్కలు నత్రజనిని గ్రహించుకోగలుగుతాయి. ఈ మూడు పోషక పదార్థాలు వాడితే పైరు మొక్కలు బాగా ఎదిగి, అధికరాబడి, అధిక లాభాలు వస్తాయి. ఈ విషయాన్ని ఋజువుచేసిన పరిశోధనా ఫలితాలను పరిశీలించండి.

| వరిపంట<br>వేసిన పోషక పదార్థాలు | ఎకరాకు దిగుబడి (75 కిలోల బస్తాలు) | ఎకరాకయ్యే సాగుబడి ఖర్చు రూ. | ఎకరాకు రాబడి రూ. |
|---|---|---|---|
| 50 కిలోల నత్రజని | 20 | 1080 | 1500 |
| 50 కిలోల నత్రజని + 25 కిలోల భాస్వరం | 29 | 1255 | 2175 |
| 50 కిలోల నత్రజని + 25 కిలోల భాస్వరం + 25 కిలోల పొటాష్ | 32 | 1305 | 2400 |

పై వివరాలనుబట్టి చూస్తే నత్రజనితోపాటు వరి పైరుకు భాస్వరం పొటాష్‌లను కూడా వేయడంవల్ల అదనంగా అయ్యే ఖర్చు ఎకరాకు రూ. 225/-. అయితే దీనివల్లవచ్చే రాబడి ఒక్క నత్రజనిని మాత్రమేవేస్తే వచ్చిన రాబడికన్నా రూ. 900/- ఎక్కువ. ఇదే విధంగా యితర పైర్లకు కూడా విజయ్ 17-17-17 వాడినట్లైయితే అధిక దిగుబడి అధిక లాభాలు పొందవచ్చు.

విజయ్ 17-17-17 లో నత్రజని, భాస్వరం, పొటాష్ పోషక పదార్థాలు సమపాళ్లలో వున్నాయి.

పొటాష్ ఎక్కువగావున్న భూములకు అనువైన ఎరువు విజయ్ 24-24-0.

విజయ్ కాంప్లెక్స్‌లతో పాటు పైరుమీద చల్లడానికి విజయ్ యూరియా చాలా అనువైనది.

విజయ్ ఎరువులనువాడండి — అధిక లాభాలను పొందండి.




విజయ్ ఎరువులను గూర్చి విపులంగా తెలుసుకోవాలంటే యీక్రింది చిరునామాకు వ్రాయండి. తగిన సలహాలను, కరపత్రాలను ఉచితంగా మీకు అందజేస్తారు.

ఏరియా మేనేజర్,
మద్రాస్ ఫర్టిలైజర్స్ లిమిటెడ్
44, శాంతినగర్ కాలనీ
హైదరాబాద్-500 028




MFL-1074

వచ్చాడు ఆఫీసుకు వెళ్తూ "ఇవాళ సాయంత్రం టాంక్‌బండ్‌మీదకి షికారుకు వెళ్దాం తయారుగా ఉండు" అని చెప్పి వెళ్లాడు రఘు. అందుకని సాయంత్రంఅయ్యే సరికల్లా అందంగా తయారైంది. కాలర్ మెడ, పొడుగు చేతులు ఉన్న రవిక, టెర్లిన్ చీర కట్టుకొని తయారైంది. ఆరయ్యేసరికల్లా 'బడ్ బడ్' అని శబ్దం చేసుకుంటూ మోటార్ సైకిల్ మీద వచ్చాడు రఘు.

రఘుకి ఫలహారం పెట్టాక "మీరివ్వాళ మోటార్ సైకిల్ తెస్తానని చెప్పలేదేం" అని అడిగింది.

"చెప్పంటే?"

"నేరేలా తయారయి ఉండేదాన్ని"

"ఏం పోయింది! రేపు అల్లా తయారవుదువుగాని"

ముందు బజారుకి వెళ్లారు లక్ష్మి కోరిక మీద. ఇద్దరికి సరిపడే మంచం, పరుపు, ఓ డ్రెస్సింగ్ టేబుల్ కొన్నారు. మర్నాడువాటిని ఇంటికి డెలివర్ చెయ్యమనిచెప్పి అక్కడ్నుంచి టాంక్ బండ్ మీదకు వెళ్లారు. అక్కడ కాస్సేపు తిరిగి తాజ్‌కి వెళ్లి భోంచేసి ఇంటికి చేరుకొన్నారు. రాత్రి దగ్గరకు తీసుకొంటున్న రఘుతో "రేపటిదాకా ఆగరా ప్లీజ్" అంది లక్ష్మి.

రఘు పొద్దున్నే భోంచేసి ఆఫీసుకు వెళ్లిపోయాడు. పదకొండు గంటలయ్యేసరికల్లా షాపువాడు మంచం పరుపు, డ్రెస్సింగ్ టేబుల్ పంపించాడు. వాటిని బెడ్‌రూంలో సర్దించింది. తెచ్చిన వాళ్ళకి చాయ్ తాగడానికి డబ్బులిచ్చి, పంపించేసింది. ఆ పైన ఇంటికి తాళంవేసి దగ్గర్లో నున్న బజార్లో షాపింగ్‌కి వెళ్లింది.

ఆరుగంటలయ్యేసరికల్లా రఘు వచ్చాడు. లక్ష్మి ఎదురువెళ్లింది. రఘు లక్ష్మిని పోల్చుకోలేదు ఇంటికెవరో అతిథులు వచ్చారనుకున్నాడు. లక్ష్మి నవ్వింది. నవ్వునుబట్టి పోల్చుకున్నాడు, ఆ నిల్చున్నది లక్ష్మేనని. మోటార్ సైకిల్‌కి స్టాండ్ వెయ్యడం మర్చిపోయి నిలబడిపోయాడు. లక్ష్మి పంజాబీ డ్రెస్‌లో పోనీటెయిల్తో కొత్తగా ఉంది.

"ఏమిటల్లా నిలబడిపోయారు రండి" అంది లక్ష్మి.

ఆశ్చర్యం నుంచి తేరుకొని రఘు లోపలికి నడిచాడు.

'ఈ అమ్మాయెవరో చాలా ఫాషనబుల్‌గా



[గత సంచిక తరువాయి]

ఉంది లక్ష్మి అయిఉండదు అనుకొన్నాను. ఏమిటి కథ? ఏమిటీవేషం?" అన్నాడు హాస్యంగా రఘు.

"నాకు చిన్నప్పటినుంచి పంజాబీ డ్రెస్ వేసుకోవాలని సరదా. మా అన్నయ్య అల్లాంటి పనులు చేస్తే తంతాననేవాడు. పెళ్ళయ్యాక నీ మొగుడు వేసుకోనిస్తే వేసుకుందూగాని అనేది అమ్మ. ఇన్నాళ్లకు ఛాన్సొచ్చింది. మోటార్ సైకిల్ మీద వెళ్లేటప్పుడు ఈ డ్రెస్సయితే మరింత రొమాంటిక్‌గా ఉండదూ?" అంది.

పావుగంటలో రఘు తయారైరాగానే బయల్దేరారు లక్ష్మి తన కుడిచేతిని, రఘు చుట్టూ తిప్పి అతని ఛాతిమీద వేసింది. ఎడం చేతిని ఎడం భుజంమీద వేసింది ఈ భంగిమలో రఘుకి చేతనైనంత దగ్గరగా ఆనుకొని కూర్చుంది. రఘుకి ఆ స్పర్శ చాలా సుఖంగా ఉన్నా తనకి తెలిసినవాళ్లు ఎవరైనా చూసేస్తారేమోనని ఇబ్బందిగా కూర్చున్నాడు. లక్ష్మి ఈ ప్రపంచంలో లేదు. రఘు టాంక్ బండ్‌కి చేరాక దిగమని లక్ష్మితో అనేదాకా లక్ష్మి అల్లాగే ఉండిపోయింది.

లక్ష్మి, రఘు పక్కపక్కనే నడుస్తున్నారు. రఘు తన చెయ్యి పట్టుకొంటాడేమోనని కొంచెంసేపు చూసింది. ఆ ధోరణిలో రఘు లేకపోవడంతో, తనే రఘు చెయ్యి పుచ్చుకొంది. ఉన్నట్టుండి రఘు చెయ్యి విడిపించుకొని "గుడీవెనింగ్ సార్" అని ఒకాయన్ని పలకరించి "మై వైఫ్ సార్" అని లక్ష్మిని పరిచయం చేసాడు. "బాగున్నారా?" ఆయనతో ఉన్న ఆవిడను పలకరించి "ఈయన మా అసిస్టెంట్ ఇంజనీర్. ఈవిడ ఆయన భార్య" అంటూ లక్ష్మికి వాళ్లిద్దరిని పరిచయం చేసాడు.

మగవాళ్లిద్దరు కాస్సేపట్లో ఆఫీసు గొడవల్లో పడిపోయారు. అసిస్టెంటు ఇంజనీర్ భార్య "మీరు కాస్సేపు చల్లగాలికి తిరుగుదామని వచ్చారేమోకదా!" అని లక్ష్మిని అడిగింది.

"అవును" అని లక్ష్మి నింపాదిగా జవాబిచ్చింది.

"మేమూ అందుకే వచ్చాం పదండి" అన్నాడు అసిస్టెంట్ ఇంజనీర్.

"మీరెక్కడికి? కొత్తగా పెళ్లయిన వాళ్లతో? బావుంది. మీతో నడవటానికి నేనున్నానుగా" అని భర్తని మందలించి, "డే ఫైవ్‌లో ఎప్పుడైనా తోచకపోతే మా యింటికి రండి" అని లక్ష్మితో చెప్పి "పదండి" అని భర్తని మరో దిశలో కదిల్చింది.

కాస్సేపు అటూ ఇటూ తిరిగాక రఘు, ఇంటికి వెళ్లడానికి తొందరపడ్డాడు. "ఇంటికివెళ్లి వంట చెయ్యాలి కూడాను" అంది లక్ష్మి "వంటాలేదు. గింటాలేదు. దార్లో ఏదైనా తినేసి పోదాం" అన్నాడు రఘు, లక్ష్మి రాసుకున్న సెంటువాసన మత్తెక్కిస్తుంటే.

ఇంటికి చేరేసరికి తొమ్మిదయింది.

"నేను స్నానం చెయ్యాలి నాకు చెమట పోసింది" అంది లక్ష్మి.

"ఇదో ఆలస్యమా?" అన్నాడు అసహనంగా రఘు.

"మీరు చెయ్యరా?"

— "నువ్వు చెయ్యి. నేను చూస్తాను."

**జరిగినకథ 2:** నరసింగరావ్, లక్ష్మిలు అన్నపూర్ణ శివరామయ్యల సంతానం. పినమామగారి కూతురు సర్వమ్మ వచ్చినప్పుడు అంటే అంట సట్టుంటుంది అన్నపూర్ణ. ఇల్లు నడిపే మగవాడు — చాకిరీచేసే ఆడదాని తల్లిదండ్రులు, తోబుట్టువులు — వారి కుటుంబాలు మాత్రమే బంధువులని, ఇపుడు మామగారు లేరు కనుక సర్వమ్మ బంధువు కాదని తెగేసి చెప్తుంటుంది అత్త లక్ష్మమ్మతో అన్నపూర్ణ. నరసింగరావ్ సుభద్రలు ప్రేమించి పెళ్లి చేసుకుంటారు. లక్ష్మి వివాహం జూనియర్ ఇంజనీర్‌గా పనిచేస్తున్న రఘుతో జరుగుతుంది. శివరామయ్య మరణంతో సుభద్ర అన్నపూర్ణమ్మనుంచి పెత్తనం తీసుకుంటుంది.

"ఛీ పాడుమాటలు" అంది లక్ష్మి.

మంచంమీద అలిసిపోయి నిద్రపోతున్న రఘు తలని గుండెలకి హత్తుకొని జుట్టు నిమురుతూ ఆలోచనల్లో పడింది. రఘు డబ్బు తీసుకోవటంవల్ల, అమ్మకి అపకారం జరిగింది. ఆ విషయం తలుచుకొంటే బాధ వేస్తోంది. కాని రఘు తీసుకోక పోయినంత మాత్రాన సింహం ఆ డబ్బు అమ్మకిచ్చేవాడా? తను సింహం గురించి మరీ అన్యాయంగా ఆలోచిస్తోంది.

అమ్మకి నిజంగా ఏదైనా ఇబ్బంది వస్తే అన్నయ్యే చూస్తాడు. చూడకపోతే ఊళ్లో వాళ్లు నోట్లో గడ్డి పెట్టారూ! కాని సుభద్ర పడనివ్వాలి కదా! ఛ. తనిల్లా ఆలోచిస్తోందేమిటి? తను మాత్రం ఓ యింటి కోడలు కాదా? తనకి మాత్రం ఆడబడుచులు లేరా? వాళ్లు తన గురించి అంత నీచంగా ఆలోచిస్తే! సుభద్ర తన స్నేహితురాలు కూడాను.

తన భర్త తన యిల్లు ఇదే తన పరిధి.

*8*

శివరామయ్య పోయి గ్గిరున సంవత్సరం తిరిగింది. సంవత్సరీకాలు వచ్చాయి. అన్నపూర్ణమ్మ పెత్తనం పోయి ఈ మేడాదిలో, క్రమేపి సుభద్ర పెత్తనం వచ్చింది. నరసింగరావ్ ఇంటిఖర్చుకి కావలసిన డబ్బు సుభద్ర చేతిలో పెడుతున్నాడు. అది పొదుపుగా వాడి మిగిల్తే తన స్వంత ఖర్చులకి వాడుకొంటుంది సుభద్ర. సంవత్సరీకాలకి కూతుర్ని అల్లుణ్ణి పిలవమని అన్నపూర్ణమ్మ చెప్ప లేదు. సుభద్రే "లక్ష్మి, వాళ్లాయన రాకుండా ఎల్లా? ఉత్తరం రాయండి" అని నరసింగరావ్ చేత ఉత్తరం వ్రాయించింది.

రఘు సెలవుపెట్టి లక్ష్మిని తీసుకొని వెళ్లాడు. అన్నపూర్ణమ్మ ఎక్కడా అల్లా చెయ్యండి, ఇల్లా చెయ్యండంటూ సూచనలు



వెయ్యలేదు. తననెవరైనా ఏదైనా చెయ్యమని అడిగితే ఆపని మాత్రమే చేస్తూ గడిపేసింది.

సంవత్సరీకాలు అవగానే ప్రయాణం పెట్టుకొన్న రఘుతో లక్ష్మి "నేను మరో రెండ్రోజులుండి వస్తానండి. ఈహడావిడిలో అసలు మావాళ్లతో మాట్లాడినట్టే లేదు" అంది.

"తమ్ముడుగారూ! మీరు లక్ష్మిని రెండ్రోజులు విడిచి ఉండగలిగితే మా దగ్గర ఉంచి వెళ్లండి కాపురానికి వెళ్లాక లక్ష్మి ఇదే రావటం" అంది సుభద్ర. రఘు లక్ష్మిని వీలైనంత త్వరగ రమ్మని చెప్పి వెళ్లిపోయాడు.

మర్నాడు లక్ష్మి తల్లినడిగింది "ఏమిటమ్మా! మరీ నాన్నగారు పోయినప్పటినుంచి అంత దిగులు పడిపోయావు. ఏదో ఇంట్లో పనులు కలిపించుకొని చేస్తూ ఉంటే జ్ఞాప

# పరిధి

కాలంతగా బాధించవు కదా!" అని.

ఈ మాటలు హాల్లోకూచుని తీరుబడిగా పాత పేపర్లు చూస్తున్న నరసింగరావ్‌కి, వంటింట్లో పని చేసుకొంటున్న సుభద్రకి వినిపించాయి ఆ ఇద్దరు, లక్ష్మితో పాటే అన్నపూర్ణమ్మ జవాబుకోసం ఎదురు చూసారు.

కాస్సేపు అన్నపూర్ణమ్మ మాట్లాడలేదు. ఆ తరువాత నెమ్మదిగా "నీకు తెలియదే లక్ష్మీ! సింహం చాలా మారిపోయాడు. ఇప్పుడు పెత్తనం అంతా వాడి పెళ్లాంది. ఇంత బతుకూ బతికి, ఇవాళ నేను దాన్ని "బియ్యం ఒక్క పావు పోసేదా? రెండు పోసేదా?" అని అడగనా! ఇల్లా దాన్నడగకుండా పోస్తినా దాని మొగుడి సంపాదనంతా నేను పాడుచేస్తున్నా ననుకొంటుంది." అంది.

ఆ మాటలు వింటూనే సుభద్ర తారాజువ్వలా లేచి వచ్చి "నేనెప్పుడల్లా అనుకున్నాట?" అని అడిగింది.

"రెండు నెలల్క్రితం, మా అన్నయ్య కుటుంబం వచ్చినప్పుడు మరో రెండ్రోజులుండి వెళ్లండిరా అన్నానని నువ్వా తరువాత నాతో పోట్లాడలేదూ?"

"నువ్వే చెప్పు లక్ష్మీ! ఈ ఊరికి ఆసుపత్రి పనిమీద, యూనివర్శిటీ పనిమీద, కొత్తగా పెట్టిన కాల్టెక్స్ కంపెనీలో ఉద్యోగాలకోసం ఎంతో మందొస్తుంటారు. వాళ్లందర్ని మనింట్లో ఉంచుకోవాలంటే మాటలు కాదు. ఈ గడ్డు రోజుల్లో మనమెంత? మన ఆస్తెంత? అయినా నేను వచ్చిన చుట్టాల్ని వెళ్లమనలేదు. కాని వెళ్తామని

అన్నవాళ్లని ఉండమని బతిమాలడం ఎందుకన్నాను!"

"మా అన్నయ్య కుటుంబం, మిగిలిన బంధువులూ ఒకటా ?" ముక్కు మీద వేలేసుకొంది అన్నపూర్ణమ్మ

ఆవిడ మాటలు విని లేచి వచ్చాడు నరసింగరావ్.

"నువ్వేమీ అనుకోనంటే ఒక్కమాట చెప్తానమ్మా! నా చిన్నప్పుడు, అప్పటికింకా లక్ష్మి పుటలేదు. నర్సమ్మత్త విజయనగరం వెళ్తూ ఈ ఊళ్లో దిగింది. అప్పుడు మనింట్లో జరిగిన రాద్ధాంతం నాకు బాగా గుర్తుంది."

"నర్సమ్మత్త ఎవరు ?" అని సుభద్ర అడిగింది.

"మా చిన్న తాతగారి కూతురు మా తాతగారు బతికున్న రోజుల్లో నర్సమ్మత్తకి మా యింట్లో, మా యింటి ఆడబడుచుగా మర్యాదలు జరిగేవి. ఆవిడ మా తాతగారు పోయిన రెండు సంవత్సరాలకి మా యింటి కోసారి వచ్చింది. అమ్మా! అప్పుడు నువ్వేమన్నావో గుర్తుందా? సంపాదించేవాడి తల్లి దండ్రులు, తోబుట్టువులు, ఇంటి చాకిరీ చేసే దాని తల్లి దండ్రులు తోబుట్టువులు తప్పించి మగిలిన అందరు దూరపు బంధువులే అన్నావు. ఇవాళ సంపాదన నాది. చాకిరి సుభద్రది. అందుచేత నీ నిర్వచనం ప్రకారమే మావయ్య ఈ యింటికి దూరపు బంధువు."

నరసింగరావ్ అన్న మాటలకి అన్నపూర్ణమ్మ నోరెత్త లేకపోయింది. ఆ మాటలు అన్నరోజున అన్నపూర్ణమ్మ తన నొసటన వైధవ్యం వ్రాసుందని అనుకోలేదు. తను ముత్తైదువుగానే పోతుందని, తను బతికున్నన్నాళ్లు తన మాట చెల్లుతుందని అనుకొంది.

"ఆ చవక రోజుల్లో కనుక మీ అమ్మగారు అంత మందిని దగ్గర బంధువుల లిస్టులో వేసారు ఈ రోజుల్లో అత్తగారికి మావగారికి, మొగుడికి పిల్లలకి చేసి మెప్పించ గలిగితే చాలు ఆడదానికి తల్లి దండ్రులకి, పెళ్లాం పిల్లలకి అన్నం పెట్టగలిగితే చాలు మొగాడికి" అంది సుభద్ర.

సుభద్ర తనతో కావాలనే ఇదంతా చెప్పిందని లక్ష్మి అనుకొంది. లక్ష్మికి చెయ్యాల్సిన విధాయకం తనకి లేదని, లక్ష్మికి తెలియజెప్పటమే సుభద్ర అన్న మాటలకి లక్ష్యం.

"చూడు లక్ష్మీ! ఇదేదో నిన్ను మనసులో పెట్టుకొని అన్నాననుకోగలవ్ అదికాదు. పూర్వం రోజుల్లోలాగా ఆడపిల్లలు నెలల కొద్దీ పుట్టిళ్లలో ఉండటం ఈ రోజుల్లో జరగటంలేదు ఎందుకు ? రోజులు మారాయి కనుక. నేను నా పుట్టింటికి వెళ్తున్నానా ? నువ్వు మాత్రం ఎన్నిసార్లు ఇక్కడికి రాగలుగుతావ్ ? ఎన్నిరోజులుండగలుగుతావ్ ? మనం అందరం కూడా ప్రపంచంలో వస్తున్న మార్పుల్ని గమనించాలి. ఇదంతా నేను చెప్తున్నది నువ్వు రాకూడదని కాదు. నువ్వు నాకు ఆడబడుచువే కాక స్నేహితురాలివి కూడాను. అందుకని నువ్వెప్పుడు రాదల్చుకున్నా రావచ్చు"

"నేను రాదల్చుకొని రావటానికి నువ్వు పిలిస్తే రావటానికి తేడా లేదూ ?"

"ఇంట్లో ఏదైనా కార్యమైతే నేను పిలవనా, నువ్వు రావా ?"

సుభద్ర అభిప్రాయం లక్ష్మికి స్పష్టంగానే తెలిసింది. ఏదైనా శుభకార్యం అంటూ జరిగితే తనే పిలుస్తుంది. మిగిలినప్పుడు లక్ష్మి రాదలుచుకొంటే రావచ్చును! లక్ష్మి చర్చ పొడిగించలేదు.

లక్ష్మి మరో రెండ్రోజులుండి హైదరాబాద్ వెళ్లిపోయింది. అన్నపూర్ణమ్మ కూతుర్ని మరో రెండ్రోజులుండమని అనలేదు.

సుభద్ర అన్న మాటలు లక్ష్మి మీద పని చేస్తూనే ఉన్నాయి. "విశాఖపట్నంలో నాకే అధికారం లేకపోతే పోనీ. ఈ ఊళ్లో ఈ ఇంటికి మహారాణిని నేను. ఈ ఇంట్లో నాకు తప్ప ఎవరికి అధికారం లేదు" అనుకొంది హైదరాబాద్‌లో తన యింట్లో ఇక్కడి కుర్చీ అక్కడికి, అక్కడికుర్చీ ఇక్కడికి జరుపుతూ.

ఓ రోజున రఘుకి ఓ పోస్టు కార్డు వచ్చింది అది జనవరి నెల.

డియర్ రఘు,

రేపు పదో తారీకున బెజవాడ నుంచి హైదరాబాద్ వస్తున్నాము మీ బావగారికి హైదరాబాద్‌లో మీటింగ్ ఉంది. వీలైతే స్టేషన్‌కిరా. నువ్వు స్టేషన్‌కి రాకపోయినా మేము ఇంటికి రా(లే)కపోము. ఇంతే సంగతులు.

ఇట్లు
కనకదుర్గ

పి. యస్.

నేను వ్రాసిన దాంట్లో పదవతారీకున బెజవాడలో బయల్దేర్తున్నామో హైదరాబాద్ చేర్తున్నామో తెల్పియడంలేదుట. హైదరాబాద్‌కి పదోతారీకున ఎక్స్‌ప్రెస్‌లో జేర్తున్నాం అని వ్రాయమన్నారు మీ బావగారు. నువ్వు స్టేషన్‌కి రాకుండా ఎగకొడ్తే "నేనే సరిగా వ్రాయలేదండి ఉత్తరం" అంటూ నిన్ను సమర్ధిస్తానుట. బావమరుదులకి, లేమ్ కుంటిసాకులు చెప్పుకునేందుకు అవకాశం ఇవ్వరాదుట.

ఉంటా
దుర్గ.

ఆ ఉత్తరంలో ఉన్న అధికార ధోరణి చూస్తుంటే లక్ష్మికి వళ్లు మండిపోయింది. గతంలో చైనావాళ్లు భారత భూభాగం మీద తమకి అధికారం ఉందంటే భారతీయుల



కెల్లా వళ్ళు మండిపోయిందో . అంత మండి పోయింది వళ్ళు లక్ష్మికి.

ఇంతకు ఈ కనకదుర్గ, రఘు స్వంత అక్క కూడా కాదు. పెత్తండ్రి కూతురు. రఘు ఇల్లాంటి ధోరణిలో అసలు సింహంతో మాట్లాడనే మాట్లాడడు. అల్లాంటప్పుడు కనకదుర్గ ఇల్లాంటి ఉత్తరం వ్రాయడం ఏంమర్యాదా ? అనుకున్నది.

ఆవిడ కొన్నిరోజులపాటు పిల్లల్తోను, భర్తతోను ఇక్కడ తిష్ఠ వెయ్యబోతోందన్న విషయం ఉత్తరంలో స్పష్టంగానే ఉంది. తను వీళ్లందరికి ఎందుకని వళ్ళు విరుచుకొని వండి వార్చాలి? తను వార్చదు. వీళ్లని ఏ హోటల్లో దింపమని రఘుతో చెప్పాలి. సుభద్ర ఇల్లాంటి పరిస్థితుల్లో అంతే చేస్తుంది. అయితే తను మంచిది కనుక వాళ్లని ఓ పూట భోజనానికి పిలుస్తుంది,

సాయంత్రం రఘువచ్చి ఉత్తరం చూస్తుంటే, లక్ష్మి తన అభిప్రాయాన్ని రఘుకి చెప్పింది.

"ఛ. అదేం బావుంటుంది. దుర్గక్క రాకరాక వస్తుంటే" అన్నాడు రఘు.

## ప రి ధి

"ఎందుకు బావుండదు. బ్రహ్మాండంగా వుంటుంది. మొన్న యుద్ధం వచ్చినప్పటి నుంచి ధరలన్నీ మండిపోతున్నాయి. ఈ గడ్డు రోజుల్లో ఏం దగ్గర బంధువులని మనింట్లో దింపుకోవాలి ! పైగా ఇల్లా దింపుకుంటూ పోతే ఈ రాజధానిలో అంతెక్కడ?"

"అందర్నీ మనమెక్కడ దింపుకుంటాం. మనకైనవాళ్లనే మనం దింపుకొంటాం."

"మనకైనవాళ్లకి నిర్వచనం?"

"మనకి చేసేవాళ్లే మనకైనవాళ్ళు. వాళ్లకే మనం చేస్తాం."

"ఆవిడ మనకు చేస్తుందా?"

"మనం బెజవాడ వెళ్తే నెత్తిమీదపెట్టు కొంటుంది"

"మనం వెళ్లం కదా ?"

"ఎందుకు వెళ్లం ?"

"ఇంతకు పూర్వం వెళ్లామా?"

"అయితే ఎప్పుడూ మనమే ముందరవెళ్లి తరువాతే ఎవళ్లైనా మనింటికి రానివ్వాలా? వాళ్లు మనకెల్లాంటి మర్యాద చేశారో చూసి మనం దానికి తగినరీతిగా తిరుగు మర్యాద చెయ్యాలా ?"

"అవును"

"వాళ్ళూ అల్లాగే అనుకొంటే ?"

"మనం వెళ్ళొద్దు"

లక్ష్మి ఒక కోణంలోంచే చూస్తోంది. తను ఎవరింటికి వెళ్లదు. వెళ్లినా అక్కడ తన యింట్లోలాగా సుఖంగా ఉండదు కనుక వెళ్లదు. అల్లాంటప్పుడు, ఎప్పుడూ వెళ్లి, వాళ్ల యిళ్లల్లో ఉండటానికి తను యిష్టపడని చుట్టాలకి తను చెయ్యడం ఎందుకు?

"చూడు లక్ష్మీ! మనకెంత ఎక్కువ బంధుబలగం ఉంటే అంత మంచిది కదా?"

"మీరేమన్నా చిన్నప్పుడు సోషల్‌స్టడీస్‌లో చదువుకున్న వసుధైక కుటుంబ సభ్యులా" అంది లక్ష్మి నవ్వుతూ. వాతావరణం కాస్త తేలికపడింది.

"కాను. అందరు నావాళ్లనుకోగల విశాల హృదయం ఉంటే నేను మహాత్ముడ్నే! అంత విశాలహృదయం లేదు నాకు. కాని నా పెళ్ళాం పిల్లలు మాత్రమే నావాళ్లనుకోడం నాకు నచ్చదు. తనవారెవరైనా దరిజేర ప్రేమమీర

(38 వ పేజీ చూడండి)

## కప్పలు ఎంత మంచివి !

కప్ప అంటే అందరికీ అసహ్యం. పిల్లలు భయపడుతుంటారు కూడా. అయితే మండూకంవల్ల మానవుడు మహోపకారం పొందవచ్చునని అరిజోనా స్టేట్ యూనివర్సిటీ (అమెరికా) కి చెందిన డాక్టర్ జార్జి పెటిట్ అంటు న్నారు. కాన్సరువ్యాధి నిరోధక కారకా లగు పదార్థాలను కప్పలనుంచి తీయ వచ్చుననీ, తాను అలాంటి రెండు పదార్థాలను కప్పలనుంచి వేరుచేశాననీ ఆయన తెలిపారు.

పాశ్చాత్యులు కప్పలను తెగ అసహ్యించుకొంటారు. ప్రాచీన చైనీయులకు మండూకశాస్త్రం బాగా తెలుసు. కప్ప గరళంనుంచి వీరు రెండు పదార్థాలను వెలికితీసి ఒక్క పుట్టుకురుపు (కాన్సరు) నివారణకు మాత్రమే కాకుండా సర్వ వ్యాధులకు వాడుతున్నారు. ఈ సర్వరోగనివారణ ఔషధాన్ని చైనాలో చాన్సూ అనీ, జపాన్‌లో సెన్సో అనీ అంటుంటారు. ఈ దేశాలలో వేలకొలది సంవత్సరాలుగా ఈ మందు వాడుతున్నారు. పంటి నొప్పినుంచి, పంటి చిగుళ్ళలో రక్తం చిమ్మే వ్యాధిదాకా పలురోగాలకు ఇది దివ్యౌషధమని వారి నమ్మకం. ఇప్పుడు ఈ మందును అరచేతి ప్రమాణంలో బిళ్లలుగాచేసి అమ్ముతుంటారు. ఈ ఔషధాన్ని హృద్రోగాలకు కూడా ఉపయోగిస్తుంటారు,

## విజ్ఞానం - వికాసం

### పంక్చర్లను తనకై అదే మూసివేసే "సీలింగ్ కాంపౌండ్"

అమెరికాలో ఒక కంపెనీవారు ఒక కొత్తమందు తయారు చేశారు. ట్యూబులో దీనిని పెట్టివేస్తారు. ఆ ట్యూబుకి మేకు గుచ్చుకొని పంక్చరు పడిందనుకోండి. అది అట్లా పంక్చర్లు అవుతూనే ఈ పొడి ఆ రంధ్రాలవద్దకు వచ్చి వాటిని మూసివేస్తుంది. ఎన్ని పంక్చర్లు పడినా సరే ఈ పొడి వాటిని తనకై అదే మూసివేయగలదు. ఈ పొడిని తడిపొడిగా నీటిలో కలిపి ట్యూబ్‌లో పెట్టి వేయాలి. పంక్చరు పడనంతవరకు ఈ పొడి ట్యూబ్‌లో ఒకచోట ఉంటుంది. పంక్చరు పడి గాలి పోవటం మొదలవ్వగానే ఈ పొడి ఆ రంధ్రందగ్గర చేరి దానిని మూసి వేస్తుంది. చిల్లికుండలో నీరుపోసి ఆ నీటిలో సన్నని ఇసుక వేస్తే,ఆ ఇసుక ఆ చిల్లిని ఎలామూసివేస్తుందో అలాగే ఈ పొడికూడా పంక్చర్‌ని మూసివేస్తుంది. గెటిస్‌బర్గ్ (పెన్సిల్వేనియా)లో పంక్చర్ ప్రూఫ్ కంపెనీ అనేసంస్థ దీనిని తయారు చేసింది. అమెరికా జాతీయ రహదారుల సంస్థ ప్రమాణాలకు ఇది సరిపోయిం దట. ఇకనుంచి సైకిళ్ళు, కార్లవారికి పంక్చరు వల్ల దారిలో ఆగిపోయే భయం ఉండదన్నమాట.




**పి. మోహన్ కుమార్**

**అ**రుంధతి చదువుకుంటోంది.

వంచిన తల ఎత్తకుండా చదవాలనుకుంటోంది.

అందంగా అమర్చబడ్డ డ్రాయింగ్ రూంలో కూర్చుని, టేబిల్ లాంప్ వెలుగులో పుస్తకాన్ని దీక్షగా చదవటానికి ప్రయత్నిస్తోంది.

అక్షరాలు మసక మసకగా, వాక్యాలు అలుక్కుపోయినట్టుగా కనిపించడంతో "వెధవది కళ్లజోడు మార్చాల్సి వచ్చేట్టుగా వుంది. రేపు డాక్టర్ రామచంద్రరావుగార్కి ఫోన్ చేసి, కళ్లు పరీక్ష చేయించుకుని, కొత్త జోడు కొనుక్కోవాలి" అనుకుంది.

అయినా పుస్తకాన్ని వదల్లేదు. నిన్న మీటింగులో అనుభవంతో, చదువుకోకుండా తనెంత తప్పు చేసిందో తెలిసొచ్చింది. ఇంగ్లిషు ధారాళంగా మాట్లాడ్డం రాకపోవడం మూలంగా ఎంత చిన్నతనం అనిపించింది!

మిసెస్ భాటియా, మిసెస్ రామన్, మిసెస్ చక్రవర్తి, మిసెస్ రామచంద్ర

అందరూ చకచకా ఇంగ్లీషులా మాట్లాడేస్తూంటే, తను కేవలం చిరునవ్వు నవ్వుతూ, తనకి ఇంగ్లీషు రాదని పట్టుబడిపోకుండా తప్పించుకోవాల్సి వచ్చింది. ఎలాగో నెగ్గుకొద్దామనుకుంటే, ఆ సమావేశానికి అధ్యక్షత వహించమన్నారు. ఉపన్యాస మిమ్మన్నారు తన గుండె ఆగిపోయింది. అదృష్టవశాత్తు అమ్మాయి అక్కడ వుండి, చిన్న ఉపన్యాసం వ్రాసివ్వడంతో సరిపోయింది కాని, లేకపోతే తన పరువు ఏమైవుండేది?

దాన్నికూడా అతి కష్టంమీద చదవగలిగింది. అందరూ ఏమనుకున్నారో ?

ఏదో తెలుగువాళ్ల మహిళామండలి సమావేశాలకి తప్ప ఇలాంటి వాటికి వెళ్ళడం ఇదే మొదటిసారి. మొదట్లో అబ్బాయితో ఉపన్యాసాలు వ్రాయించుకున్నా, ఇప్పుడుతెలుగులో తడుముకోకుండా మాట్లాడ్డం అలవాటయిపోయింది. ఇంగ్లీషులో కూడా అలా మాట్లాడటం నేర్చుకోవాలి.

తన భర్తతోటి ఆఫీసర్ల భార్యలంతా పట్టభద్రులు. తను డిగ్రీ సంపాదించలేకపోయినా, కనీసం మెట్రిక్కన్నా పూర్తి చెయ్యాలి.

ఆ నిర్ణయానికి రావటంతో, ఆమె పట్టుదల పెరిగిపోయింది.

పుస్తకంలో తలదూర్చి. దీక్షగా చదవడానికి ఉపక్రమించింది.

కర్టెన్ తీసుకుని లోపలికి రాబోయినభర్త చదువుకుంటున్న తన్నిచూసి, ముసి ముసి నవ్వులు నవ్వుకుంటూ, బయటికి వెళ్లిపోవడం చూసిన ఆమెకు ఒళ్ళు మండిపోయింది.

తమ సుఖం, తమ పిల్లల సుఖంకోసం భార్యల అభివృద్ధికి ప్రతిబంధకంగా నిల్చే భర్తలంటే ఆమెకు కోపం వచ్చింది.

ఐనా స్త్రీలు ఎందుకు వాళ్ల వలలో పడిపోతున్నారో. ఆఖరికి తనుకూడా ఎందుకు పడిపోయిందో, తనకే అర్థం కాలేదు.

"అసలు తనప్పుడు పెళ్లి చేసుకోకుండా వుండాల్సింది. బాగాచదువుకుని, అరుంధతిగా పేరుతెచ్చుకునిఅప్పుడు పెళ్లిచేసుకోవాల్సింది" అనుకున్న అరుంధతి, గతాన్ని గుర్తుతెచ్చుకుని భారంగా కుర్చీలో వాలిపోయింది,

నుదుట పట్టిన చిరుచెమటను కొంగుతో తుడుచుకుంది, అందరిచే "అదృష్టవంతురాలు" అని ప్రశంసించబడ్డ అరుంధతి.

"అరుంధతి అదృష్టవంతురాలు— కాదు చాలా అదృష్టవంతురాలు" అంటా రంతా.

ఆవిడకు మూడు లక్షలు ఖరీదుచేసే అందమైన ఇల్లుంది.

ఆ ఇంటిచుట్టూ తరులతా నికుంజాలతో వెలసిల్లే అందమైన ప్రాంగణం వుంది.

ఇంటి లోపల అందాలు విరజిమ్మే ఖరీదైన ఫర్నిచరుంది.

ఆ ఇంట్లో సినిమాలో సెట్ లాంటి, అందమైన పడక గది వుంది.

ఆ గదిలో ఒక పెద్ద బీరువా వుంది.

ఆ బీరువాలో, ఒకరోజు విడచిన చీరె మరొకరోజు కట్టుకోకపోయినా మూడు నెలల పాటు సరిపోయే ఖరీదైన చీరెలున్నాయి.

అదే బీరువాలో, రెండు అరల నిండా కళ్లు చెదిరేలా చేసే బంగారు నగలున్నాయి.

ఆ ప్రక్క సొరుగులో చెక్కుబుక్కుంది.

ఆ ఎకౌంటున్న బాంక్‌లో చెక్కు చెదరని బోల్డు డబ్బుంది.

ఆవిడకు ఊరంతా మెచ్చుకునే సమర్థవంతుడైన భర్తున్నాడు.

అందర్నీ ఆకర్షించిన పిల్లలున్నారు.

ఆవిడ భర్త విద్యాసాగర్ అందరి మన్ననలకూ పాత్రుడైన ఉన్నతాధికారి.

పెద్ద కూతురు నిర్మల శ్రీనగర్‌లో పేరు మోసిన గైనకాలజిస్ట్. ఆమె భర్త కిరణ్ ప్రఖ్యాత ఆర్థోపెడిక్ సర్జన్. చిదిమితే పాల్గారే ఇద్దరు పిల్లలతో శలవల్లో చుట్టపు చూపుగా వచ్చిపోతుంటారు వారు.

ఆ తర్వాత వాడు రవి. ఢిల్లీ ఐ. ఐ టి లో యం. టెక్. పాసై ఇప్పుడు అమెరికాలో రిసెర్చి చేస్తున్నాడు.

ఆ తర్వాత అమ్మాయి శ్యామల, బి. యస్‌సి. ఫైనలియర్ చదువుతూ, కాలేజీ బ్యూటీగా పేరొందింది. భరతనాట్యం, సంగీతం లాంటి లలిత కళల్లో ఆరితేరిన ఆ అమ్మాయిని పెళ్లాడ్డానికి బంధుకోటిలోని యోగ్యుడైన ప్రతి కుర్రాడూ వువ్విళ్ళూరడంతో, ఆ అమ్మాయి పెళ్లి ఆవిడకొక సమస్యగా పరిణమించింది.

ఆ తర్వాత వాడు శీను ఇంటర్‌లో స్టేట్ ఫస్ట్‌కోసం అహోరాత్రులు శ్రమపడుతున్నాడు స్ఫురద్రూపి, మాటకారి అయిన వాణ్ణి, వాడి నాన్నలాగే ఐ. ఎ. యస్. ఆఫీసర్ని చెయ్యాలన్నది ఆవిడ ఆశ.

ఆ ఇంట్లో ఆవిడ వాక్కు వేదవాక్కు, ఎవరూ ఆవిడ మాటను కాదనరు. ఆవిడ గీసిన గీత దాటరు. అలా దాటవలసిన అవసరం ఆ యింట్లో ఎవరికీ రాలేదు. అసలు ఎదుటి వారు దాటే అవసరం లేకుండా గీత గియ్యడం ఆవిడ అలవాటు. అదే ఆవిడ ప్రత్యేకత.

పెద్దమ్మాయి నిర్మల మెడిసన్ చదువుతూ అదే కాలేజీలో యం.యస్. చేస్తున్న కిరణ్‌ని ప్రేమించానని ఉత్తరం వ్రాసినప్పుడు, "నే నొస్తున్నాను. నువ్వు తొందరపడకు" అని ఉత్తరం, తిరుగు టపాలో వ్రాసింది. ఆ అమ్మాయి తొందర పడవలసిన అవసరం రాకుండానే, వెంటనే ఆ ఊరు వెళ్లి; అతన్ని, వాళ్ల పెద్దల్ని కలిసి వాళ్ల పెళ్లికి ఏర్పాటు చేసింది.

ఇలా ఇంట్లో ఎవరూ తన మాటను కాదనవలసిన అవసరం రాకుండా పరిస్థితిని తీర్చిదిద్దడం ఆవిడలో వున్న విలక్షణమైన లక్షణం.

ఆవిడ శక్తి సామర్థ్యాల్ని గుర్తించిన ఆవిడ భర్త అన్ని విషయాల్నీ ఆవిడకి వదిలేసి, ఆఫీసుపనిలో లీనమైపోతాడు.

ఒక్కమాటలో చెప్పాలంటే ఆవిడ, ఆ ఇంటిని ఏకఛత్రాధిపత్యంగా ఏలుతోంది. ఏ పని చేపట్టినా దానిలో లీనమైపోయి భారీ ఎత్తున చెయ్యాలని ఆవిడ ఉత్సాహపడుతుంది.

చిన్నప్పుడు పరీక్షలో కూడ వ్రాయవలసిన ప్రశ్నలన్నిటికీ సమాధానాలు వచ్చినా, తనకు బాగా నచ్చిన ప్రశ్నను తీసుకుని, దాంట్లో లీనమైపోయి, మూడు గంటల్లో ముప్పై పేజీల సమాధానం వ్రాసేది. పాపం దిద్దేవాడు, ఆ సమాధానానికి ముగ్ధుడైపోయి పూర్తి మార్కులు వేసినా, మిగిలిన ప్రశ్నలకి సమాధానం వ్రాయకపోవడంతో పరీక్షపోయేది.

అలా పరీక్షలు పోయినా ఆ లక్షణం ఆవి



# అరుంధతీ ఆంధ్రా మెట్రిక్

డకు మంచే చేసింది. ఆవిడ చేతిమీద పెళ్ళి, పండుగ, పబ్బం ఏది జరిగినా అతి లక్షణంగా భారీ ఎత్తున అత్యద్భుతంగా జరుగుతుంది.

ఆ విషయాల్లో తహసీల్దార్లు, పోలీసు సూపరెంటెండెంట్లు, కాలేజీ ప్రిన్సిపాల్ లాంటి పెద్ద ఉద్యోగులు సైతం ఆవిడ సలహాకోసం వచ్చేవారు. ఆవిడ సలహా చెప్తోంటే చెవులు రిక్కించి విని, తలవూచి సంతృప్తిగా వెళ్ళిపోయేవారు.

ఇన్ని ప్రత్యేకతలున్న ఆవిణ్ణి అందరూ మెచ్చుకుని, "అరుంధతి అదృష్టవంతురాలు" అని అసూయ పడ్తే ఆశ్చర్యం ఏముంది?

కాని ఆవిడకి కూడా తీరని కోరికలున్నాయని, ఆవిడకూడా ఇతరుల్ని చూసి అసూయ పడ్తుందని ఎవరికీ తెలియదు.

మెట్రిక్ పాసైన ఆడవాళ్ళన్నా, నలభై ఏళ్ళకి పైబడ్డా సన్నగా తీగెల్లా చకచకలాడుతున్న ఆడవాళ్ళన్నా ఆవిడకి అసూయ. అలాంటి వాళ్ళను చూసినప్పుడల్లా ఆవిడ అదోలా అయిపోతుంది. తిరిగి మామూలు పరిస్థితుల్లోకి రావడానికి అయిదు నిమిషాలు పడ్తుంది. ఆ అయిదు నిమిషాల్లో ఆవిణ్ణి ఎవరేనా పలకరించడం, ఆవిడ చుట్టుపక్కల ఎవరైనా గొడవ చెయ్యడం, నవ్వడం జరిగితే ఆరోజు వాళ్ళు తిన్నన్ని తిట్లు ఎప్పుడూ తినరేమో అనిపిస్తుంది. ఎప్పుడూ చిరునవ్వుతో వుండే ఈమెలో ఇంత కోపంఉందా? అని ఆశ్చర్యపోతారు.

ఉండుండి సడన్‌గా అంత సీరియస్‌గా ఎందుకు మారిపోతోందో ఆవిడ భర్తకి, పిల్లలకి సైతం మొదట్లో తెలిసేదికాదు. కాలక్రమంగా పై చెప్పిన కారణాల్ని వాళ్ళు వెతికి పట్టుకున్నారు. అలా పట్టుకున్న తర్వాత ఆ అయిదు నిమిషాలు ఆవిణ్ణి ఒంటరిగా వదిలేయడం నేర్చుకున్నారు.

చిన్నప్పట్నుంచి పరీక్షలు పాసై ఉద్యోగం చెయ్యాలని ఆవిడ కలలు కనేది· సహజంగా అందమైన ఆమె తన లావణ్యాన్ని అలాగే కాపాడుకోవాలని కోరుకునేది.

కాని తానొకటి తలిస్తే దైవమొకటితలుస్తాడంటారు, ఒకొక్కప్పుడు తాను తలిచినదాని కన్నా, దైవం మరింత మంచినే తలచి ఆశీం

(31 వ పేజీ చూడండి)

## చేసిన పరీక్షల వలన తేలింది...







# రుచికీ, విటమిన్లకూ, పుష్టికీ బిస్కట్ అంటేనే ఇది

బ్రిటానియా

# గ్లూకోజ్-డి



బ్రిటానియా గ్లూకోజ్–డి బిస్కట్లతో పాటు మరో ప్రముఖ బ్రాండ్ గ్లూకోజ్ బిస్కట్లను పోల్చి చూసేందుకు చేసిన పరీక్షల వలన తేలిందేమిటంటే: విటమిన్లు మరియు మొత్తం మీద పుష్టినిచ్చే పదార్థాలు గ్లూకోజ్–డిలో ఎక్కువగా ఉన్నాయని. అంతేగాక రుచికోసం, తియ్యదనం కోసం, కరకరలాడే తనానికి దీనివి కావాలంటారని. శక్తినిచ్చే విషయంలో, గ్లూకోజ్ కన్న గ్లూకోజ్ డి 20% ఎక్కువ శక్తినిస్తుంది। బ్రిటానియా గ్లూకోజ్–డి–తియ్యటి రుచితో కూడిన శక్తి ।




అందుకే మరి ఏ ఇతర గ్లూకోజ్ బిస్కట్ కన్న బ్రిటానియా గ్లూకోజ్-డి అంటేనే ఎక్కువ మంది ఆకర్షితులవుతున్నారు.

బ్రిటానియా బ్రిటానియా బిస్కట్లు అత్యుత్తమమైనవి

లింటాస్-83C.GL-16-140 TL

సీరియల్

# మనుగడలో మలుపులు

—జీడిగుంట రామచంద్రమూర్తి

*(గత సంచిక తరువాయి)*

సూర్యం వంగి, ఆకు పట్టుకుని చూసి, "ఇంకా తయారుకాలేదు...పిందెలుగా ఉంటాయి" అన్నాడు.

"నీకెలా తెలుసు ?"

"నేనుకూడా పొలం పనులు చూస్తూంటాను రాధా !"

"అయితే బావా ! నేనో ప్రశ్న అడుగుతాను జవాబు చెప్తావా ?"

ఏమిటన్నట్లు చూశాడు సూర్యం.

"చెట్లలో రెండురకాలు. ఒకటేమో నేలమీద కాయలు కాసేవి ... రెండోదేమో భూమి లోపలే పండేవి ! నీకేవంటే యిష్టం ?"

సూర్యం నవ్వుకున్నాడు.

"రెండూనూ."

"నాకలాకాదు. భూమిలో పండేవయితేనే యిష్టం. వాటిని ఏ చిలకా, గోరింకా చెరపవు. కాకులు పొడవ్వు. తల్లి గర్భంలోలాగా సురక్షితంగా పెరిగి ఆరోగ్యంగా వుంటాయి. కదూ ?" అంటూ గబుక్కున వంగింది. సూర్యాన్నికూడా తనతోపాటే పక్కకు లాగింది.

ఎటో చూస్తున్న సూర్యం ఉలిక్కిపడి, ఏ 'విషపురుగో'నని భయపడి వెనక్కు జరిగాడు. కానీ కాదు ... రాధ తీక్షణంగా చూస్తున్నది ఆరుద్ర పురుగుల్ని.

"బావా ! చూడు అవి ఎంత అందంగా వున్నాయో ? నీ జేబురుమాలు యిస్తావా, ఇంటికి పట్టుకపోదాం వీటిని." మెరిసే కళ్లతో వాటిని చూస్తూ అడిగింది రాధ.

"వద్దు రాధా ! అవి ఎక్కడ వుండాలో అక్కడ వుండటమే మంచిది. అయినా యిక్కడయితే అవి అందంగా కనిపిస్తాయికానీ ఇంటిదగ్గర కాదు !"

"బలే బలే ! నాకు ఈ రంగంటే యెంతో ఇష్టం." ఆనందంగా చప్పట్లుకొడుతూ, వాటినే చూస్తూ అంది రాధ.

"ఈసారి వచ్చేటపుడు నీకు అలాంటి రంగులో ఓ చీర తెస్తానులే !"

> ***జరిగిన కథ 1 :*** తన చిన్ననాడే తమతో సంబంధం తెంపుకున్న మేనమామ వెంకట్రామయ్య యింటికి వచ్చిన సూర్యప్రకాశరావు తనెవరో చెప్పుకోవాల్సి వచ్చినందుకు బాధపడ్డాడు. వెంకట్రావ్ భార్య వర్ధనమ్మ. కూతురు రాధ. తన తల్లి బ్రతికున్నపుడే తన పెళ్లాంగా ముద్ర వేయించుకున్న రాధ ఎలా వుంటుందో తెలీకపోయినా ప్రాణప్రదంగా ప్రేమిస్తాడు సూర్యం.

**రా**జా తన గడ్డాన్ని పట్టుకునివున్నాడు. ఏమిటన్నట్లు చూశాడు సూర్యం. రాజా అతన్ని కళ్ళతోనే వారిస్తూ, ఉండమన్నట్టు సైగచేసి లోపలకు వెళ్ళాడు.

రాధకి అర్ధమయింది.

'ఏమిట'న్నట్టు చూస్తూ తల ఎగరేశాడు సూర్యం.

రాధ పగలబడి నవ్వింది. సూర్యం భుజాన్ని తడుతూ అంది.

"బావా ! నేను మూగదాన్నికాదు. మాట్లాడగలను."

"అయామ్ సారీ రాధా !"

"ఫరవాలేదు." రాధ అన్యమనస్కంగా అంది.

"ఏమిటో బావా ! అమ్మ పనుల్తో సతమతమవుతూ వుంటుంది. నాన్న వ్యవహారాల్లో పడి మునిగితేలుతూ వుంటాడు. నా మాటలు వీడు వినిపించుకుంటాడేకానీ బదులు చెప్పలేడు. నువ్ కబుర్లు చెప్తావు కదూ."

రాధ మాటల్లోని మానసిక బాధని సూర్యం గ్రహించాడు.

కరగబెట్టిన వెన్నమురగల గిన్నెలో రాజా వచ్చాడు. వాళ్ళ ముందర పెట్టి 'వేసుకోండి' అన్నట్లు చూశాడు.

లాంఛనంగా వేసుకున్నాడు సూర్యం.

'అంత కొంచమే వేసుకుంటావేం ?' అన్న గదమాయింపుతో చూసి, గబుక్కున నెయ్యంతా సూర్యం ప్లేటులో ఒలకబోశాడు రాజా. సూర్యం ఆశ్చర్యంగా చూస్తే రాజా నవ్వుతూ చప్పట్లు చరిచాడు.

'మాటలు రాకపోయినా ఎంత మర్యాద తెలిసిన సంస్కారం వాడిది ?' — అనుకుంటూ ఓ క్షణం అలా చూస్తూండిపోయాడు రాజావంక...

ఆ సాయంత్రం పొలంవైపు షికారు బయల్దేరారు.

సూర్యానికి నాన్న గుర్తుకొచ్చాడు.

రాజా దోసకాయలు కోసి, సంచీలో వేసి పట్టుకొచ్చాడు. తానొకటి తీసుకుని సూర్యానికీ రాధకీ కూడా యిచ్చాడు.

చుట్టూ చూసిన సూర్యానికి విశాలంగా పరచుకున్న వేరుశనగ చేనూ — మరోవైపు దట్టంగా జొన్నపైరూ కనిపించాయి.

దూరంనుంచి సన్నగా ఉద్యోగ విజయాల్లోని పద్యం రాగయుక్తంగా వినిపిస్తోంది.

"బావా ! మీ పొలాలుకూడా యిలానే వుంటాయా? ఏం వేశారూ ఈ ఏడు? ... వేరుశనగ కాయలు తింటావా ?" అని అడిగింది రాధ, ఆ చేను గట్టుక్రింద గడ్డివాము నీడలో, కూర్చున్న తరువాత.

సూర్యం మాటలకు బుంగమూతి పెడుతూ అంది "మరి ఇప్పుడెందుకు తేలేదూ ?" అని !

"అసలు నువ్వింత ఎత్తు పెరిగిపోయావని నాకెలా తెలుసు ?"

"ఊ !" అంటూ మూతివిరిచింది.

"మీ బావ నీకేం తెచ్చాడూ ? అని ఎవరైనా అడిగితే నేనేం చెప్పేది ?"

"చెప్పనా ?" ఆమె కళ్ళల్లోకి చూస్తూ అడిగాడు.

"చెప్పు !"

"ఎవరైనా అడిగితే, నీ గుప్పిట మూసేసి — 'మా బావ తెచ్చిన బహుమతి ఈ గుప్పిటలో వుందీ, మంచిమనసున్న వాళ్ళకైతేనే నా చేతిలో వున్నది కనిపిస్తుంది' అని గుప్పిట తెరువు." అన్నాడు సూర్యం.

"తమకు మంచి మనసుందని ఎవరికి వారు అనుకుంటారు కనుక, అదేమిటో కన్పించిందంటారు. అంతేగా ? భలే బావుంది. కానీ ఈసారి వచ్చినప్పుడు నువ్వలాంటి బహుమతి తెస్తే నీతో పలకను." మారాంచేసే పాపలా మూతి పెట్టింది రాధ.

కొండల్లోకి దిగిపోతున్న సూర్యుణ్ణి చూపించాడు రాజా వాళ్ళిద్దరికీ ! 'ఆ సుందర దృశ్యాన్ని వర్ణించాలని వాడి మూగహృదయంలో ఎంత తపనగావుందో పాపం' అనుకున్నాడు సూర్యం.

"పాపం ! నేనీసారి వచ్చేటప్పుడు రాజాకికూడా ఏదైనా తెస్తాను రాధా !" అన్నాడు.

"బావా ! నీది జాలి గుండె ! నిజంగా నువ్ చాలా మంచివాడివి." తృప్తిగా అంది రాధ.

"మరి మా వూరు వస్తావా పోదాం ?"

"అత్తయ్య లేదుగా ?"

"మంచి మావయ్యున్నాడు — నేనున్నాను."

"అదికాదు బాబూ ! నాకు వంట బాగా రాదు. అవి బాగులేదూ — ఇవి బాగులేదూ అని నువ్వూ మావయ్యా అంటే నేను పడను మరి !"

"ఛీ ! ఛీ ! వంట చేయటానికా ? కాదు. నాతో కబుర్లు చెప్పటానికి !"

"మరి నీతో కబుర్లు చెబుతూ కూర్చుంటే మావయ్యకి కోపం రాదూ ?"

"ఎందుకూ ?" ప్రశ్నించాడు సూర్యం.

"ఏవో ! నేనెవరితోనైనా కబుర్లుచెప్తుంటే మా నాన్న కళ్లు ఎర్రగా అయిపోతాయి. కేకలేస్తాడు. అందుకే ఈ మూగవాడ్ని తీసుకొచ్చాడా అనిపిస్తుంది." రాధ మనసులో ఆ వయసు తెస్తున్న అల్లరి సూర్యం గ్రహించాడు.

రాజా, వాళ్ళిద్దర్నీ 'ఇంటికి వెడదాం' అన్నట్టుగా చేయి పట్టుకుని లాగుతూ ముందడుగులు వేస్తున్నాడు.

## 2

'కోమలా విలాస్' హోటల్లోని మూడో అంతస్తులో వున్న తొమ్మిదో నంబరు గది దగ్గర నిలబడి కాలింగ్‌బెల్ నొక్కాడు శేషగిరి.

తలుపుతీసిన రాజారాంగార్ని చూసి వినయంగా నమస్కరించాడు.

"ఓహో ! శేషగిరా ? ... రా ... కూర్చో."

తను బెడ్‌మీద కూర్చుంటూ పక్కనున్న సోఫా చూపించారు రాజారాంగారు.

"మా వూరు వచ్చి మీరు యిలా హోటల్లో బసచేయటం నాకేం నచ్చలేదు" అన్నాడు శేషగిరి కూర్చున్న తరువాత.

బదులుగా ముందు నవ్వేరు రాజారాంగారు. నవ్విన తరువాత బదులు చెప్పారు.

"ఈ ఊరు నీదేకాదు శేషగిరీ! నాది కూడానూ! ఒక్కొక్కసారి ఆలోచిస్తుంటే పరిస్థితులకు మనిషి ఎలా బానిసయిపోతాడోనని పిస్తుంది."

రాజారాంగారు చెప్పేదేమిటో పూర్తిగా అర్థం కాక ఆయనవైపే చూస్తూ వుండిపోయాడుశేషగిరి.

"మా తాత ముత్తాతలంతా యిక్కడే వ్యవసాయం చేశారు. నేనూ నా భార్యా పద్దెనిమిదేళ్లు ఈ వూళ్ళోనే కాపురంచేశాం. వ్యవసాయం కలిసి రాలేదు. నా దృష్టి వ్యాపారం మీదకు మళ్ళింది. అంతలో పిల్లలుకూడా చదువుల కెదిగారు నేనెలాగా పెద్దచదువులు చదువుకోలేదు. అందుకే పిల్లలకయినా మంచి చదువులు చెప్పించాలనుకున్నాను. అప్పుడే నాకు మంచి అవకాశంకూడా వచ్చింది. నా మిత్రుడొకడు 'హైదరాబాదులో వ్యాపారం పెడుతున్నాను ర'మ్మంటే వెళ్లాను. నేనూ చేతులు కలిపాను. అదృష్టం బాగుండి, యివ్వాళ నా వ్యాపారం ఒకటికి పదింతలయింది."

ఒక్క క్షణం ఆగి తృప్తిగా నిట్టూర్చారు రాజారాంగారు.

"మీ మంచిమనసే మిమ్మల్ని వృద్ధిలోకి తీసుకొచ్చింది" అన్నాడు శేషగిరి.

"కావచ్చు! కానీ యిక్కడ నాకేం మిగిలింది చెప్పు? ఈ విజయనగరంలో ఒకపుడు మా తాత ముత్తాతలు వ్యవసాయం చేసినా, నేనూ నా భార్యా పద్దెనిమిదేళ్లు కాపురం చేసినా, నా పిల్లలు యీ వూళ్ళో పుట్టిపెరిగినా, అవన్నీ ఏవో మధుర స్మృతుల్లా మిగిలిపోయాయి. రేపు నా పిల్లలకు ఈ ఊరితో యీమాత్రం సంబంధంకూడా వుండదు. ఇవన్నీ తలుచుకుంటూంటే నాకేమనిపిస్తుందో తెలుసా?" శేషగిరివైపు చూస్తూ అడిగారు రాజారాంగారు.

శేషగిరి బదులు చెప్పలేదు.

మళ్లీ ఆయనే అన్నారు.

"ఎక్కడో పుడతాం — మ రెక్క డె క్క డో పెరుగుతాం — చివరకెక్కడో రాలిపోతాం అని ఎవరో అంటే తేలిగ్గా తీసుకుని మరుక్షణంలో మరచిపోతాం. కానీ అందులో ఎంతటి వేదాంతం వుందో అనిపిస్తుంది — ఎంతటి జీవిత సత్యం వుందో అనుకుంటాను."

"నిజమే బాబుగారూ! అందుకే 'ఉన్నవూరూ కన్నతల్లీ' అంటూంటారు. అయినా ఈ వూళ్ళో మీదీ అని చెప్పకోవటానికి పదెకరాల మాగాణీ వుందిగా."

"అంతేకాదు శేషగిరీ! నావాళ్లూ అని చెప్పకోవటానికి కూడా యిక్కడ నువ్వున్నావ్."

రాజారాంగారి మాటలకు కోపమొచ్చింది శేషగిరికి.

"అందుకే కాబోలు మీరు హోటల్లో దిగారు. నా యింటికి వస్తే నేను ఆమాత్రం మీకు మర్యాద చేయలేననేగా మీ ఉద్దేశ్యం..."

"నా ఉద్దేశ్యం అదికాదు. నీదసలే ఆడదిక్కులేని సంసారం. పైగా నువ్ ఇంట్లో వుంటావో, పొలంలో వుంటావో తెలియదు. అదీకాక వయస్సు పెరుగుతున్నకొద్దీ సుఖానికి అలవాటుపడిపోతోంది ఈ ప్రాణం. కొంచెం సౌకర్యంగా వుంటుందని హోటల్లో దిగాను. అంతమాత్రంచేత నువ్ చిన్నబుచ్చుకుంటావనుకోలేదు. అందుకే, నేనిక్కడకు రాగానే, నీకోసం కుర్రాణ్ణికూడా పంపించాను" లంటూ సమర్థించుకున్నారు రాజారాంగారు.

కొన్ని క్షణాలు యిద్దరిమధ్యా నిశ్శబ్దంగా గడచిపోయాయి.

రాజారాంగారు లేచి 'బోయ్'ని పిలిచి కాఫీ తెప్పించారు.

"ఈ ఏడు చేలు ఎలావున్నాయ్?" కాఫీ తాగుతూ అడిగారు.

"బాగున్నాయండీ! క్రిందటేటికంటే ఈ ఏడు రాబడి బాగా వుంటుందనుకుంటున్నాను." అన్నాడు శేషగిరి.

"ఒక ఏటికి మరో ఏడు నువ్ నాకు లాభాలే చూపిస్తున్నావ్."

"నేను చూపించేదేముందండీ? మీకున్న భూమి మంచిది."

"అదొక్కటేకాదు శేషగిరీ! వ్యవసాయం చేస్తున్న మనిషి మనసుకూడా మంచిది." అన్నారు రాజారాంగారు గర్వంగా.

"మీరు మాటి మాటికీ నా మంచితనాన్ని గుర్తుచేస్తూ మీ మంచితనాన్ని మరచిపోతున్నారు" నిష్కాపట్యంగా అన్నాడు శేషగిరి.

ఇద్దరూ కాఫీత్రాగటం పూర్తిచేశారు.

ఆ సాయంత్రం తమ పొలాలవైపు బయల్దేరారు రాజారాంగారు. పక్కనే నడుస్తున్న శేషగిరి, లాను ఎరువులు ఎలా వాడుతున్నదీ, ఏవి పంట వేస్తే ఎంత గిట్టుబాటవుతున్నదీ వివరిస్తున్నాడు. అంతా విన్నతర్వాత రాజారాంగారు అడిగారు—

"శేషగిరీ! ఈ విషయాలన్నీ నువ్ ఇప్పుడు ఎందుకు చెబుతున్నావ్?" అని.

ఆ ప్రశ్నకు శేషగిరి బిత్తరపోయాడు.

"ఆదేమిటండీ? అలా అడుగుతారు? ఈ పొలాలు మీవి. వీటి గురించి మీకుకాకపోతే మరెవరికి చెబుతాను?" అన్నాడు సవినయంగా.

"నిజమే! ఈ పొలాన్ని నీకు పసిపాపలాగా



ఒప్పచెప్పాను ఒకనాడు. పసిపాపను లాలించి, బుజ్జగించి, మారాంచేస్తే భరించి, విద్యాబుద్ధులు నేర్పించి, మనిషిగా మలచినట్లు — ఈ పొలాన్ని గుండెల్లో పెట్టుకొని నిండుగా పండించావు. ఇప్పుడు నేను గర్వపడుతున్నది నా పొలాన్ని చూసి కాదు ... దాన్ని కంటికి రెప్పలా కాపాడుకునే మనిషి దొరికినందుకు."

ఈసారి గర్వపడటం, రాజారాంగారి మాటలు విన్న శేషగిరి వంతైంది!

అంతలోనే యిద్దరూ జామతోట దగ్గరకు వచ్చారు. గట్టుక్రింద వున్న జామచెట్టు నుంచి దోరగా మగ్గిన రెండు జామకాయలు కోసి రాజారాంగారి చేతిలో పెట్టాడు శేషగిరి. వాటిని తీసుకుని తృప్తిగా తిన్నారు రాజారాంగారు.

"నేను ఈ రాత్రి బస్సులో హైదరాబాదు వెళ్ళిపోతున్నాను శేషగిరీ!" అన్నారు రాజారాంగారు పొలం నుంచి తిరిగి వచ్చేస్తూంటే.

"అప్పుడేనా ? మరో రెండురోజు లుంటారను కున్నాను."

"నాకూ వుండాలనేవుంది! కానీ వ్యవహారాలు క్షణంకూడా తీరికలేకుండా చేస్తున్నాయి. ఇప్పుడు కూడా పనికట్టుకొని యిటు వచ్చేవాణ్ణి కాదు. కలకత్తాలో కాన్ఫరెన్సు వుంటే వెళ్ళాను. 'ఎలాగా నిన్ను చూసి చాలాకాలమయిందీ — వున్న ఊరునూ నమ్ముకున్నవారినీ మళ్ళీ ఎప్పటికి చూడగలుగుతానో' అని తిరిగి వెడుతూ వెడుతూ యిలా యిక్కడ దిగాను." రాజారాంగారు అలా అంటూంటే, ఏదో వినకూడని మాట విన్నట్టు నొచ్చుకున్నాడు శేషగిరి.

"మీ అబ్బాయి బాగా చదువుతున్నాడా ?" మరికొన్ని నిముషాల తర్వాత రాజారాంగారు అడిగారు శేషగిరిని.

"బాగానే చదువుతున్నాడండీ! ఈ ఏటితో ఆ బి. ఎస్సీ. కూడా అయిపోతుంది. 'ఎంబీబియస్' చదవాలని వాడికి మహా కోరిగ్గా వుంది."

"మరింకనేం ?... చదివించేస్తే పోలే ?... 'అవతల జనాభా పెరిగిపోతోందీ — ఆ పెరిగిపోతున్న జనాభా కంతటికీ చాలినంతమంది వైద్యులు లేరనీ—' ఒకటే గొడవ..."

"నాకూ చదివించాలనే వుంది! కానీ కాలం కూడా కలసిరావాలి కదండీ!... వాడి చదువుకు వాళ్ళ మేనమావ అండగా నిలబడితే బాగుండు ననిపించింది" — ఆశగా అన్నాడు శేషగిరి.

"నిజమే! కానీ మీ అందరితో తెగ్రతెంపులు చేసుకున్న మీ బావమరది మేనల్లుణ్ణి ఆదరిస్తాడా అని ?... అయినా, దేనికయినా పట్టూ విడుపూ వుండాలోయ్!... ఎవరో ఒకరు ఒక మెట్టు క్రిందకు దిగి రాకపోతే ఎలా చెప్పు ?..." రాజారాంగారి మాటలు మందలింపు స్వరంలో వున్నాయ్...

"నే నెప్పుడూ క్రింద మెట్టు వాడినేనండీ!... ఎంత క్రిందకు వెళ్ళటానికి నే నెపుడూ బాధ పడను. అందుకే సూర్యాన్ని సిరిపురం పంపించాను." —

శేషగిరి అలా మాట్లాడుతూంటే ఆ మాటల లోని భావాల్ని చదువుకున్నారు రాజారాంగారు.

ఆయన, ఆ రాత్రి బస్‌లో ఎక్కికూర్చునే వరకూ కూడానే వున్నాడు శేషగిరి.

"సూర్యం పరీక్షలు అయిపోగానే నా కుత్తరం రాయి. అక్కడ 'మెడిసిన్'లో సీటు కోసం ప్రయత్నిస్తాను." — బస్ కదలిపోతూంటే అన్నారు రాజారాంగారు.

బస్‌స్టాండు నుంచి ఇంటికి తిరిగివచ్చిన శేషగిరికి ఆకలి కాలేదు. శాంత ఫొటోకి ఎదురుగా వున్న కుర్చీలో సూర్యుని ఆలోచిస్తూ వుండిపోయాడు.

## 3

రాధా సూర్యం గుమ్మంలోకి అడుగు పెట్టే సరికి లోపలనుంచి ఏవో మాటలు వినిపిస్తున్నాయి.

వెంకట్రామయ్య, భార్యను కేకలేస్తున్నాడు.

"తీసుకెడతానన్నవాడికి బుద్ధిలేకపోతే, పంపిన దానికి నీకైనా బుద్ధిలేదూ ? ఇంత పొద్దుపోయాక వాళ్ళిద్దరూ అలా తిరుగుతూంటే చూసేవాళ్ళు ఏమనుకుంటారు ?"

"రాధ వెడతానని సరదాపడితే, వెళ్ళిరమ్మన్నాను. కూడా రాజును పంపించానుగా! ఇంతలో ఏం మునిగిపోతుందీ ?" అన్నది వర్ధనమ్మ.

వెంకట్రామయ్య మళ్ళీ ఏదో అనబోయాడు. కాని లోపలకు అడుగుపెట్టిన, వీళ్ళను చూసి తమాయించుకున్నాడు. రాధ తలవంచుకుని లోపలకు వెళ్ళిపోయింది. సూర్యంకూడా ఏమీ ఎరగనట్టు ఊరుకున్నాడు. రాజు తిన్నగా పెరట్లోకి నడిచాడు.

ఆ రాత్రి భోజనంచేయాలని అనిపించలేదు సూర్యానికి! కానీ సభ్యతకోసం — అందులోనూ, రాధ మనసులో నొచ్చుకుంటుందేమోనని, అది కాస్తా అయిందనిపించి గదిలోకి వెళ్ళాడు.

మడతమంచం మీద తనకోసం పక్కవేస్తున్నాడు రాజు.

"అప్పుడే భోజనం అయిపోయిందా ?" అన్నట్టుగా తల ఎగరేసి చేతులతో సంజ్ఞ చేస్తూ అడిగాడు.

ఆప్యాయతా, అభిమానం, మాటల్లోంచి వచ్చేవికావు. మనసులోంచి వస్తాయి. ఆటువంటి మనసు రాజుది.

"రాజూ! నీకిక్కడ బాగుందా ?" మడత మంచంమీద కూర్చుంటూ అడిగాడు సూర్యం.

రాజు తల వంచుకున్నాడేకానీ బదులు చెప్పలేదు.

"పోనీ నాతో మా ఊరు వచ్చేస్తావా ? అక్కడ నువ్ హాయిగా చదువుకోవచ్చు."—

"నాకు మాటలు రావుగా ?" - మళ్ళీ సంజ్ఞలతోనే చెప్పాడు.

అది అర్థం చేసుకున్న సూర్యం అన్నాడు.

"ఫరవాలేదు. మాటలు రాకపోయినా బళ్ళో మాస్టారు చెప్పింది వినచ్చు; అర్థం చేసుకోవచ్చు, పరీక్షలు రాసి పాసవచ్చు!... చదువుకుంటే మంచి ఉద్యోగం కూడా వస్తుంది." —

రాజు కళ్ళు ఆనందంతో మెరిశాయి. ఆ ఆనందాన్ని సూర్యం ముందు వ్యక్తం చేయాలనుకున్నాడు. కానీ అంతలో వంటింట్లోంచి వర్ధనమ్మ రాజును అన్నానికి పిలవటంతో అక్కడ్నుంచి వెళ్ళిపోయాడు.

దీపం తీసేసి, కళ్ళు మూసుకుని పడుకున్నాడు సూర్యం...

చీకటంటే తనకు ఇష్టం... కానీ ఆ చీకటిని కళ్ళు తెరచి చూడాలంటే భయం. చీకట్లో అలా కళ్ళు మూసుకుని ఆలోచిస్తూ పడుకోవటంలో ఏదో అనిర్వచనీయమైన ఆనందం దొరుకుతుంది తనకు!... కానీ —

ఇప్పుడు సూర్యానికి ఆ ఆనందమూ లేదు — ఆలోచనా రావటంలేదు... అంతకుముందు మావయ్య అన్న మాటలే, కీచురాళ్ళ రొదలా చెవుల్లో మార్మ్రోగుతున్నాయి...

మావయ్య అన్నట్టు తనకు నిజంగా బుద్ధి లేదా ?

ఎప్పుడో తెగిపోయిన బంధుత్వాలు మళ్ళీ కలవక పోతాయా అనుకున్నాడు...

ఏమీ తెలియని వయస్సులో 'రాధ తనకు పెళ్ళాం' అంటే కాబోలుననుకున్నాడు. తనకు తెలియకుండానే పెరిగే వయసుతోబాటు రాధ పట్ల వలపును పెంచుకున్నాడు.

కానీ... ఇప్పుడు మావయ్య కాదంటే ఆ వలపును త్రెంచుకోగలడా ?...

అసలు త్రెంచుకుని తను జీవించగలడా ?

తనది విచిత్రమైన ప్రేమ!



# యువతరం

చిత్రకళ, సంగీతం, నాట్యం లాంటివి యువకులు హాబీగా ప్రారంభిస్తేనే బాగా రాణిస్తారల్లే వుంది. ఈ బొమ్మలో



వున్న యువకుడు చిత్రకారుడు. పేరు వేజెండ్ల సత్యనారాయణరావు. ఇతనికి '75 లో పత్రిక మీద దసరా ప్రత్యేక చిత్రం పడటం ఒక పెద్ద క్రెడిట్‌గా భావిస్తున్నాడు. వి. యస్. రావు పేరుతో చాలా బొమ్మలు పత్రికల్లో పడ్డాయి. బి. ఏ. చదువు కొనసాగిస్తున్నాడు ప్రయివేటుగా. డ్రాయింగ్‌లో హయ్యర్ పరీక్ష ప్యాసయివాడు. — "సినిమాలు ఎక్కువగానే చూస్తాను. అందమైన ఆడపిల్లలు కనిపిస్తే చూస్తానంతేగాని ఏడిపించే యత్నం చేయను." అన్నాడు. ఆడపిల్లల్ని వేధించే యువకులకు యితను ఆదర్శప్రాయుడు కాడేమో కాని స్వస్థలం పిడపర్తులోను, చదువు కొన్న వూరు తెనాలిలోను యితనికి మంచి యువకుడనే పేరుందనే అనుకోవాలి. వడ్డాది పాపయ్య గారంటే గౌరవం. ఆయన బొమ్మలంటే ఎంతో ప్రీతి అని చెప్పాడు.

ఈ ప్రక్క ఫొటోలోని యువకుడు పొన్నపల్లి దుర్గాప్రసాద్. మంచి వయొలిన్ వాద్యగాడు. కర్నాటక సంగీతంలో వాయులీనం సబ్జక్టుగా డిప్లొమా అందుకున్నాడు. కాలేజీ పోటీలోను యితరత్రాకూడా చాలా ప్రయిజులు కొట్టానని చెప్పాడు. కేంద్ర సాంస్కృతిక శాఖవారి స్కాలర్ షిప్‌లో అన్నవరపు రామస్వామిగారి దగ్గిర శిక్షణ పొందుతున్నాడు. — అన్నట్లు



స్కైపు కూడా హయ్యర్ పరీక్ష ప్యాసైనాడుట... ఇతని ఆశయం హాబీ కూడా రేడియో ఆర్టిస్టుగా పేరు ప్రఖ్యాతి గాంచటమేనని పిస్తోంది...

*

ప్రక్క బొమ్మలో నున్న రామసూరికవి. అసలు పేరు సూరిసీతారామయ్య. కాని అంతా 'రామసూరి'గానే వ్యవహరిస్తారు. భీమవరం పి జి. సెంటర్ నుంచి ఎం. ఏ. పరీక్ష [తెనుగు] ప్యాసైనాడు. చాలా గేయాలు రాశాడు. పత్రికలలో పడుతూవుంటాడుతరచు. రేడియో కవి సమ్మేళనంలో ఒకసారి పాల్గొన్నయీ యువకునికి ఆధునిక కవిత్వం అంటే స్వేచ్ఛా



ఛందస్సులో కవిత్వం రాయడం యిష్టం. కాని ప్రాచీన కవిత్వం అంటే గౌరవం. "సామాజిక స్పృహ లేకుండా రచనలు చేయడంకన్నా పెన్నుముడిచి జేబులో పెట్టుకోడం" మంచిది అంటున్నాడు.— పుస్తకాలు చదవటం ముళ్లపూడి,రా.వి. శాస్త్రి, శ్రీశ్రీ లను అభిమానించడం, స్నేహితులతో కబుర్లు యివి యితని హాబీలు. 'ముత్యాల ముగ్గు' సినిమా ఇష్టం. ఇంకా ఇలా అన్నాడు రామసూరి. —

"ప్రేమ వ్యవహారాల మీద నాకు నమ్మకం లేదు. వయసులో వున్నవారు కలిసిమెలిసి తిరిగినంత మాత్రాన వారు ఒకరి హృదయాని నొకరు అర్థం చేసుకొని స్నేహితులుగా మసలినంత మాత్రాన 'ప్రేమ'ని అంటగట్టడం సబబు గాదు. ప్రేమించుకొని పెళ్లి చేసికొని కాపర్లాలు చేసేవాళ్ళు తక్కువమంది కనబడుతున్న కారణంచేత ప్రేమించడమనేది 'తొందరపాటు' అనే నా అభిప్రాయం.

ఈనాటి సమాజంలో మానవత్వం కరువైపోతుందే అని బాధపడుతూ వుంటాను." [విరాళి]

---

రాధను చూడకముందే ప్రేమించాడు. చూసిన తరువాత మరచిపోలేకపోతున్నాడు.

రాధను చూస్తూంటే తనకు లేడి కళ్లు కనిపించాయి. ఆమె మాట్లాడుతూంటే వేయి వీణలు మ్రోగాయి. రాధ నవ్వుతూంటే మల్లెలు విరిశాయి. అంతేకాదు — ఆమె అడుగుల్లో హంస నడకను చూశాడు.

కానీ రాధకూడా తనను ప్రేమిస్తోందా? తనంటే యిష్టపడుతోందా? తను విజయనగరం వెళ్లేలోగా ఆ విషయం తెలుసుకోవాలి!

ఆ ఆలోచన రాగానే సూర్యం మనసు కుదుటపడింది. కుదుటపడిన ఆ మనసుకు చిన్నగా కునుకు పట్టింది. ఆ నిద్రలో ఓ కల!

ఆ కలలో—

తను పెళ్లికొడుకై పీటలమీద కూర్చున్నాడు. పురోహితులు మంత్రాలు చదువుతున్నారు. చుట్టూ ఎవరెవరో జనం ... తనకెవరూ స్పష్టంగా కనిపించటంలేదు. తన కళ్లు రాధకోసం నిరీక్షిస్తున్నాయి. అంతలో యిద్దరు ముత్తయిదువులు రాధను తీసుకొచ్చి తన పక్కనే కూర్చోబెట్టారు!

నీలంరంగు పట్టుచీర కట్టుకుంది రాధ. కళ్యాణతిలకం దిద్దుకుంది. ఓరకంటితో తనవైపు చూసింది. తను పులకించిపోయాడు. పురోహితుడు మంగళసూత్రం తన చేతిలో పెట్టాడు! తను లేచి రాధ మెడలో మంగళసూత్రం కట్టబోతున్నాడు. అక్కడే నిలబడివున్న ఓ ముత్తయిదువు రాధ జడను ఎత్తి పట్టుకుంది. ఆ జడ పొడుగునా కుట్టిన మల్లెపూలు ఒక్కసారి గుబాళించాయి. మంగళవాయిద్యాలు మిన్నుముట్టాయి! అంతలో-

"ఆగండి!..." ఎక్కడినుంచో పెద్ద కేక...

వెనుతిరిగి చూశాడు. తన మేనమామ! ... వెంకట్రామయ్య!

"ఈ పెళ్లి జరగటానికి వీల్లేదు" అంటూ గబగబా వచ్చి పెళ్లిపీటల మీద వున్న రాధను బరబరా లాక్కుని వెళ్లిపోయాడు.

"రాధా!"... అరవబోయాడు సూర్యం. గొంతు పెగల్లేదు. అంతే!... కలచెదిరిపోయింది!

ఒక్కసారిగా లేచి కూర్చున్నాడు సూర్యం... చుట్టూ చీకటి... అంత చలిలోనూ తనకు ఒళ్లంతా చెమటలు పోశాయి. విపరీతమయిన దాహ మేసింది. రాజును పిలిచి మంచినీళ్లు తెమ్మని అడగాలనుకున్నాడు. మంచం మీద నుంచి దిగి, ఆ చీకటిలోనే గుమ్మం వైపు అడుగులు వేశాడు!...

పక్క గదిలోంచి ఏవో మాటలు వినిపిస్తూంటే అప్రయత్నంగా ఆగిపోయాడు.

"ఇన్నేళ్లనుంచీ లేని బంధుత్వం ఇప్పుడే వచ్చింది కాబోలు" — అది వెంకట్రామయ్య గొంతు.

"మాట పట్టింపులు వచ్చినంత మాత్రాన, శాంత మీ చెల్లెలు కాకపోతుందా?" — వర్ధనమ్మ సమర్థిస్తూ మాట్లాడుతోంది.

"శాంతతోబాటే ఆ బాంధవ్యాలూ, బంధుత్వాలూ తెగిపోయాయి. అయినా పదహారేళ్ళుగా అవసరంలేని ఈ బంధుత్వాన్ని మళ్లీ కలుపుకోవాలని శేషగిరి అనుకుంటున్నాడంటే ఇందులో ఏదో అంతరార్థముండే వుంటుంది."—

"అర్థాలూ అంతరార్థాలూ మీరే ఊహించుకుంటారు. అయినా మీ బావగారు చేసిన తప్పేమిటో నా కర్థం కాలేదు."—

"ప్రతి విషయమూ నీ కర్థమయ్యేలా చెప్పవలసిన అవసరం నాకు లేదు. అదీ కాక ఆ సూర్యం గాడు ఇంటల్లుడి పోజ పెట్టి, రాధను చేంగట్ట చుట్టూ వెంటేసుకుని తిరిగితే నేను సహించేది లేదు." వెంకట్రామయ్య మాటలు పదునుగా వున్నాయి.

"ఏదో సరదాపడి వచ్చాడు! నాలుగు రోజులుండి వెళ్లిపోతాడు. దేనికయినా పట్టూ విడుపూ వుండాలి! మనంతట మనం కాకపోయినా, మీ బావగారే ఇష్టపడి సూర్యాన్ని ఇక్కడికి పంపించారు. అయినా సూర్యానికి ఏం తక్కువ చెప్పండి? ఆస్తి లేకపోయినంత మాత్రాన అతన్ని మన ఇంటల్లునిగా చేసుకుంటే ఏం?... రాధకు చక్కని ఈడూ జోడూ!"

"అణాకానీ ఖరీదుచెయ్యని అనాధకయినా ఇచ్చి చేస్తానుకానీ, వీడికి మాత్రం మన రాధను కట్టబెడతానని అనుకోకు." ఆవేశంగా అన్నాడు వెంకట్రామయ్య.

ఆ తర్వాత వర్ధనమ్మ ఏమన్నదో సరిగా వినిపించలేదు సూర్యానికి. వినాలనికూడా అనిపించలేదు. మంచినీళ్లు అడక్కుండానే వెనక్కివచ్చి మంచంమీద పడుకున్నాడు. (ఇంకా వుంది)



'వేములవాడ భీమకవి'లో ఎన్. టి. రామారావు

# ★ సినిమా విశేషాలు ★

## రావుగోపాలరావు బహుపాత్రాభినయం

"ముత్యాలముగ్గు, జేబుదొంగ" చిత్రాల తరువాత విడుదలయిన "చిట్టెమ్మ – చిలకమ్మ" చిత్రం కూడా రావుగోపాలరావుకు పేరు ప్రతిష్ఠలను తెచ్చిపెట్టింది.

గత వారం ఏ. వి. ఎమ్. స్టుడియోకు వెళ్లినప్పుడు ఆయన్ను యమధర్మరాజు గెటప్‌లో చూచి ఆశ్చర్యపడ్డాను. పౌరాణిక వాచకం అద్భుతంగా ఉన్న నిజాన్ని చెవులారా విని విస్తుపోయాను.

యమధర్మరాజు వేషం వేస్తున్న చిత్రం పేరు "ప్రేమాయణం" అని తెలిసింది. అదే చిత్రంలో మాయలమరాటీగా, దుర్యోధనుడిగాకూడా రావు గోపాలరావు నటిస్తున్నట్టు, నిర్మాత ముప్పలనేని శేషగిరిరావుగారు చెప్పారు.

"ప్రేమాయణం" చిత్రంలో చంద్రమోహన్, రోజారమణి, రాజబాబు, అల్లురామలింగయ్య, నారాయణరావు, మాడా, గిరిజారాణి, హేమాచౌదరి ముఖ్య పాత్రలను పోషిస్తున్నారు.

"ప్రేమాయణం" చిత్రానికి సముద్రాల, మహదేవన్, రామ్‌చౌదరి, కళాధర్ సాంకేతిక శాఖలకు ఆధిపత్యం వహించ, నాగార్జనేయులు దర్శకత్వాన్ని నిర్వహిస్తున్నారు.

పోలాప్రగడ సత్యనారాయణమూర్తిగారి నవ్వుల కథ "ప్రేమాయణం"ను శ్రీఫిలింస్ విడుదల చేస్తారు.

'పెద్ద మనిషి' శివాజీ



## పొరుగింటి పుల్లకూర

ఇది శ్రీ వనజా ఎంటర్‌ప్రైజస్ నిర్మిస్తున్న చిత్రానికి పెట్టిన క్రొత్త పేరు. "దూరపు కొండలు" అనే పేరుతో లోగడ ప్రచారమైంది ఈ చిత్రం.

విక్టరీ మధుసూదనరావు దర్శకత్వంలో డిశంబర్ 1 వ తేదీ నుంచి షూటింగ్ జరుపుకుంటున్న ఈ చిత్రానికి చక్రవర్తి సంగీతం, బొల్లిముంత మాటలు, భాస్కరరావు ఛాయ, అంకిరెడ్డి కూర్పు, మోహన కళ సమకూరుస్తున్నారు.

అక్కా – చెల్లెండ్రుగా కాంచన, జయచిత్ర నటిస్తున్న ఈ చిత్రంలో వారికి జతగా రామకృష్ణ, మురళీమోహన్ నటిస్తున్నారు. రాజబాబు, నిర్మల ముఖ్య పాత్రలను పోషిస్తున్న ఈ చిత్రాన్ని మార్చికంతా పూర్తిచేయాలనుకుంటున్నారు ఇ. కుప్పుస్వామి గారు (చిత్ర సమర్పకులు.) ఇ. హరికృష్ణ నిర్మిస్తున్న ఈ చిత్రం నైజాంలో సౌజన్య చిత్ర ద్వారా, సీడెడ్‌లో జయలక్ష్మి ద్వారా విడుదలౌతుంది.

"కంటెన్‌ట్‌మెంట్ ఈజ్ ఎ కన్‌టిన్యువస్ ఫీస్ట్" అంటే "తృప్తి"కి హద్దులేదని అర్థం. ఉన్నదాంతో తృప్తిపడడంమానేసి, ఉన్న వాళ్లను చూచి అంతటి ఉన్నతి తనకూ రావాలని ఆశపడుతుందొక మగువ కోరికలు పెంచుకుని, కోరి పెళ్లి చేసుకున్న వ్యక్తినే దెప్పిపొడుస్తుంది. శ్రీమంతుడ్ని పెళ్లి చేసుకుని, శ్రీవారితో కాసేపు కులాసాగా గడిపే అదృష్టానికి నోచుకోలేదే అని మధనపడుతుంది మరో స్త్రీ. ఇలా యిద్దరు స్త్రీల విభిన్న మనస్తత్వాల మధ్య సాగిపోయే కథే "పొరుగింటి పుల్లకూర" చిత్రం.



'రక్తపాశం'లో జయప్రద

### మంచి మనిషి నిర్మిస్తున్న "మహానుభావుడు"

మంచి మనిషి హేమాంబరధరరావు సుభాషిణీ కంబైన్స్ పేరిట నిర్మిస్తున్న "మహానుభావుడు" చిత్రం నవంబరు 30న, ఎ. వి. ఎమ్. లో ప్రారంభమైంది.

ప్రముఖ నిర్మాత డి. వి. ఎస్. రాజుగారు స్విచ్ ఆన్ చెయ్యి, విఖ్యాత నిర్మాత ఎమ్. ఎస్. రెడ్డి క్లాప్ కొట్ట "వెల్‌కమ్ టు యూ ఆల్" అనెడి కృష్ణంరాజు డైలాగుతో షూటింగు ఆరంభమైంది.

లక్షాధికారి కృష్ణంరాజు తన దగ్గరున్న ధనాన్ని బాధిత ప్రజలకు దానం చెయ్యడంవల్ల, అందరూ ఆయన్ను "మహానుభావుడు" అన్నారు.

ఈ చిత్రానికి ఆదుర్తి నరసింహమూర్తి సంభాషణలను రాశారు. ఈయన కలం ఎన్నో చిత్రాలకు (అజ్ఞాతంగా) వుపయోగపడియుంది.

"మహానుభావుడు" చిత్రానికి చలపతిరావు సంగీతాన్ని, శేఖర్ – సింగ్ ఛాయాగ్రహణాన్ని, బి. ఎన్. కృష్ణ కళను నిర్వహిస్తున్నారు.

ఈ చిత్రంలో దుష్టచతుష్టయంతోబాటు మరొకరు కలిసి పాపం చేస్తారు. పంచపాపులుగా రాజనాల, ముక్కామల, వీరభద్రరావు, జగ్గారావు, రాఘవరావు నటిస్తున్నారు.

చిత్రంలోని ప్రధాన పాత్రలను కృష్ణంరాజు, జయసుధ, రాజబాబు; గిరిజారాణి మాడా పోషిస్తున్నారు.

ఈ చిత్రానికి జగపతి పిక్చర్స్ (ఆంధ్రా), సౌజన్య పిక్చర్స్ (నైజాం), జయలక్ష్మి పిక్చర్స్ (సీడెడ్) పంపిణీ దారులు.

హేమాంబరధరరావును మంచిమనిషి అనడానికి బలవత్తరమైన కారణం వుంది. "తండ్రులు – కొడుకులు" చిత్రంలో నష్టపోయిన భాగస్వాములకు "ఆడపడుచు" ఆర్జించిపెట్టిన లాభాలను పంచిపెట్టారు.

### కృష్ణ - మంజుల

విఖ్యాత చిత్ర నిర్మాత డూండీగారి పర్యవేక్షణలో, తయారు కానున్న వర్ణ చిత్రంలో కృష్ణ, మంజుల, సత్యనారాయణ ప్రధాన పాత్రలను పోషించగలరు. 'యాక్షన్ చిత్రాల మాష్టరు' కె. ఎస్. ఆర్. దాస్ దర్శకత్వాన్ని నిర్వహించగలరు.

### పూర్ణమ్మ కథ క్లయిమాక్స్

మాత్రం మిగిలింది అన్నారు ఆ చిత్ర దర్శకుడు నందవరావును యిటీవల కలిసినపుడు. (నాగేష్‌గారి అకస్మాత్తు అనారోగ్య కారణంగా డిలే అయింది.) డిశంబర్ మాసాంతానికి క్లయిమాక్స్ పూర్తిచేసి, ఫిబ్రవరిలో విడుదల చేయాలనుకుంటున్నాం అన్నారు కె. వి. యస్.

రోజారమణి పూర్ణమ్మగా నటిస్తున్న ఈ చిత్రంలో ఆవిడకు భర్తగా నాగేష్, పాలేరుగా రామకృష్ణ, తదితర ముఖ్య పాత్రల్లో ప్రభాకర రెడ్డి, అల్లురామలింగయ్య, ధూళిపాళ కన్పిస్తారు.

(శివాజీ ఆర్ట్స్ బ్యానరుపై ఈ చిత్రాన్ని నాగేశ్వరరావు నిర్మిస్తున్నారు.)

### త్రిమూర్తి ప్రొడక్షన్స్ !

ఈ ఏడు "అభిమానవతి" చిత్రాన్ని నిర్మించిన త్రిమూర్తి ప్రొడక్షన్స్, వచ్చే ఏడు ఒక వినోదాత్మక చిత్రాన్ని నిర్మించేందుకు నిర్ణయించిన విజాన్ని, నిర్మాత సాంబశివరావుగారు చెప్పారు.

హిందీలో బల్‌బలేగా ఆడిన "చోర్ మచాయె చోర్" చిత్రాన్ని తెలుగులో నిర్మించబోతున్నట్లు త్రిమూర్తి ప్రొడక్షన్స్‌లో ఒకరయిన సాంబశివరావు గారు చెప్పారు.

### జగపతి అధినేతకు ధనవర్షం

నమ్ముకున్న సిబ్బందికోసం ఒక వర్ణ చిత్రాన్ని నిర్మించిన మంచిమనిషి రాజేంద్రప్రసాద్‌గారికి "పిచ్చిమారాజా" ధనవర్షాన్ని కురిపించగల స్తోమతను బడసియున్న విజాన్ని రషస్ చూసిన విమర్శకులు వెల్లడించారు.

తెలుగు చిత్రాలలో జనరంజకంగా సెట్స్ వేసి, సంగీతాన్ని సమకూర్చి, అందాన్ని కూర్చి, అన్ని తరగతుల వారిని తృప్తిపరిచే "కిటుకు" జగపతి అధినేతకు తెలుసు అని ప్రేక్షకులకు తెలుసు.

"పిచ్చిమారాజా" చిత్రంలో సంగీతం ఒక స్పెషాలిటీ; ఫైట్స్ ఒక వెరైటీ; క్లయిమాక్స్ ఒక వినూత్న సృష్టి.

ఈ చిత్రంలో శోభన్‌బాబు ధరించిన పాత్రలో ఎంత విశిష్టత కనిపిస్తుందో, మంజుల పాత్రలో అంత ప్రత్యేకత అగుపిస్తుంది.

రచనలో మాణిక్యాలను సృష్టిస్తున్న సత్యానంద్, సంగీతంలో అద్వితీయుడు అనిపించుకుంటున్న మహదేవన్, ఛాయాగ్రహణంలో కొత్త రికార్డును ఏర్పరుస్తున్న వెంకటరత్నంగార్లు "పిచ్చిమారాజా" చిత్రాన్ని ప్రజామోదంపొందే విధంగా దర్శకుడు రాజేంద్రప్రసాద్‌గారికి సహకరించారు.

"పిచ్చిమారాజా" చిత్రంలో రాజబాబు హాస్యం, జయమాలిని–హలం శృంగారం, ధూళిపాళ – అల్లు రామలింగయ్య దుర్మార్గం, రావుగోపాలరావు మంచితనం ఎంతవరకు ప్రేక్షకులు సహించగలరో, అంతవరకే పెట్టిన ప్రజ్ఞావంతుడు శ్రీ రాజేంద్రప్రసాద్.

సంక్రాంతి పండుగయొక్క సంబర, సంతోషాలను "పిచ్చిమారాజా" తనదిగా చేసుకోగలదు. అన్నపూర్ణా విడుదల.



'పిచ్చిమారాజా'లో జయమాలిని

# సినిమా

'మళ్లీ ఎప్పుడో? ఎక్కడో?'లో ?

### శోభన్‌బాబు నేపాల్ ప్రయాణం

తెలుగు చిత్ర నిర్మాతలు ఊటీ, కొడైకెనాల్, కాశ్మీర్, రాజస్థాన్ మున్నగు ప్రదేశాలకు వెళ్లారు గాని, యింతవరకు ఎవరూ నేపాల్‌ను లొకేషన్‌గా ఎన్నుకోలేదు.

"దొరబాబు" చిత్ర నిర్మాతలు నేపాల్‌లో షూటింగు జరపాలనుకున్నది నిజమే అయినా, కారణాంతరాలవల్ల అది సంభవించలేదు.

శ్రీ లక్ష్మి ప్రొడక్షన్స్ అధినేత పూర్ణచంద్ర రావుగారికి నేపాల్ వెళ్దామన్న ఆలోచన రావడం, అక్కడికి వెళ్లి "బ్యూటీ స్పాట్స్" చూసిరావడం జరిగింది.

రాబోయే జనవరిలో "మంచిమారాజు" తన ప్రేయసి జయసుధతో నేపాల్ అందాన్ని ఆస్వాదించ బోతున్నాడు.

"మంచి మా రా జు" చిత్రానికి తాతినేని రామారావు దర్శకుడు, లక్ష్మి పంపిణీదారులు.

### మారుతిలో జయసుధ

"బాబు" చిత్ర నిర్మాత కుమార్‌గారిని, క్రాంతి కుమార్‌గారి ఆఫీసులో కలిశాను. అప్పుడు, దర్శకుడు రాఘవేంద్రరావు కూడా వున్నారు.

"రాజా"గా శోభన్‌బాబు నటిస్తున్న వర్ణ చిత్రం షూటింగు ఏప్రిల్ నుంచి ప్రారంభం అవుతుందని మారుతీ ప్రొడక్షన్స్ అధినేత చెప్పారు.

హీరోయిన్‌గా జయసుధ నటించే అవకాశం వున్నదని, దర్శకుడు రాఘవేంద్రరావు చెప్పారు.

### శుక్ర దశ తార

జయసుధ జాతకం శుక్రదశలో అడుగెట్టింది అని చెప్పడానికి అనేక దృష్టాంతాలు వున్నాయి.

వాంప్ వేషాలకు పనికొస్తుంది అనుకున్న జయసుధకు "లక్ష్మణరేఖ" చిత్రంలో 'హీరోయిన్ పాత్ర రావడం ఎంత అదృష్టమో, రామానాయుడు గారి చిత్రం, పి. ఎ. పి. సుబ్బారావుగారి చిత్రం రావడం అంతకు మించిన అదృష్టం అనే చెప్పాలి.

### శోభన సిఫారసు !

శోభన్‌బాబు నటిస్తున్న మూడు చిత్రాలలో జయసుధకు హీరోయిన్ పాత్ర వస్తుందని ఆమె కల కూడా కనియుండదు. శ్రీ లక్ష్మి ప్రొడక్షన్స్ (మంచిమారాజా) విజయలక్ష్మి ఆర్ట్ పిక్చర్స్, మారుతీ ప్రొడక్షన్స్ వంటి ప్రముఖ చిత్ర నిర్మాణ సంస్థలలో చోటుదొరకడం అంత తేలికయినపనికాదు.

(జయసుధ తెలుగు వుచ్చారణ పట్ల ప్రేక్షకులకు అసంతృప్తి వున్న నిజాన్ని చెవులారా విన్నాను. ఆమె తెలుగు చిత్రాలలో నటిస్తూ, భాష పట్ల శ్రద్ధ వహించకపోతె ?)

యువతరాన్ని ఆకర్షించే అందచందాలు వున్నవి గాబట్టే, నిర్మాతలు జయసుధను పెట్టడానికి సంశయించడంలేదు.

నృత్యంలో మరికొంత శిక్షణ అవసరమని జయసుధ గుర్తించి, అభ్యసించగలిగితె, రాబోయే సంవత్సరాల్లో "గ్లామర్ హీరోయిన్" పట్టాన్ని పొందగలదు.

### లక్ష్మి పంపిణీలో శోభన్‌బాబు మరో చిత్రం

నవంబర్ తొలిరోజున శ్రీకారం చుట్టుకున్న విజయలక్ష్మి ఆర్ట్ పిక్చర్స్ వర్ణ చిత్రం తాలూకూ రెండవ షెడ్యూలు డిశంబర్ 29 వ తేదీ నుంచి జనవరి 9 వరకూ జరపడానికి నిశ్చయించినట్టు నిర్మాత టి. త్రివిక్రమరావు చెప్పారు. ఈ షెడ్యూల్లో శోభన్, మంజుల, జయసుధ, దాదాపు అందరు ఆర్టిస్టులు పాల్గొంటారు. ఇప్పటికి మూడు పాటల చిత్రీకరణను, కొన్ని ముఖ్య సన్నివేశాలను పూర్తి చేసారు దర్శకుడు టి. కృష్ణ. తమ రెండవ షెడ్యూల్లో చిత్రానికి సంబంధించిన ముఖ్య ఘట్టాలను షూట్ చేయబోతున్నాం అన్నారు త్రివిక్రమ రావు.

హీ–మాన్ వెరైటీ పాత్రను పోషిస్తున్న ఈ చిత్రంలో మంజుల, జయసుధ, రోజారమణి, అంజలీదేవి, శ్రీదేవి, సత్యనారాయణ, రాజబాబు, అల్లురామలింగయ్య, రావుగోపాలరావు, ప్రభాకర రెడ్డి, శ్రీధర్, సాక్షిరంగారావు, సత్యేంద్ర కుమార్ ముఖ్య పాత్రధారులు. మహదేవన్ సంగీత విభాగానికి, జి. కె. రాము కెమెరా శాఖకు, సత్యానంద్ మాటల రచనకు, కుదరవల్లి సెట్స్ నిర్మాణానికి నిర్దేశకత్వం వహిస్తున్న ఈ చిత్రం లక్ష్మి ఫిలింస్ గుడారం గుండా విడుదలౌతుంది. ఏప్రిల్‌కు చిత్రాన్ని సిద్ధం చేయాలనే ఉద్దేశ్యంలో వున్నారు నిర్మాత త్రివిక్రమరావు.

'ఫరార్'లో షర్మిలా, అమితాబ్



## ముగ్గురు మూర్ఖులు

శ్రీమంతుడు మాధవరావు విధి వైపరీత్యం వల్ల ఆస్తిని కోల్పోయి, చితికిన మనస్సుతో అదృశ్యుడవడంతో అతడు చనిపోయాడనే నిర్ణయాని కొస్తారు ఆయన సతి, కూతురు. మాధవరావ్ యింట్లో పని మనుషులుగా పని చేస్తుంటారు ముగ్గురు వ్యక్తులు. ఏ సమయంలో ఏం మాట్లాడాలో, ఎలా మాట్లాడాలో తెలియని అమాయకులు ఆ ముగ్గురు. మాధవరావు పోవడంతో అతని భార్య, అతని గుడ్డికూతురు వీధులపాలౌతారు. ఒకానొక సందర్భంలో ఈ గుడ్డిపిల్లను కొందరు దుర్మార్గులు బలవంతం చేస్తుంటే, అప్పటికే మాధవరావుచే బయటికి గెంటబడ్డ ఈ ముగ్గురు వ్యక్తులు రిక్షా త్రొక్కుతూ, మాధవరావు భార్యను, కూతుర్ని రక్షిస్తారు.

ఇలా వుండగనే మాధవరావు మాశికం వస్తుంది. ఈ మాశికానికి బ్రాహ్మలు కావాలిగా. అందుకే బ్రాహ్మలకోసం అన్వేషణ జరుపుతూ, మాధవరావు మాశికానికి అతన్నే బ్రాహ్మణార్థానికి తీసుకొస్తారు. చనిపోయాడనుకున్న మాధవరావు ఎదుట నిలబడ్డంతో ఏమీ తోచలేదు ఎవ్వరికీ. మూర్ఖులు, మూర్ఖులని తిట్టిన ఆనాటి మాధవరావు వారు చేసిన ఈ మంచికార్యానికి ఎంతో కృతజ్ఞతలు తెల్పాడు. చూశారా! మాశికాలెంత పనిచేసాయో! మాసిపోయిన బ్రతుకుల్లో మళ్లీ వసంతాన్ని తెచ్చాయి.

లావణ్య పిక్చర్స్ పతాకంక్రింద మహేష్‌గారు నిర్మిస్తున్న "ముగ్గురు మూర్ఖులు" చిత్రంలో చోటుచేసుకుంది పై తమాషా ఘట్టం. మాధవరావుగా గుమ్మడి, ముగ్గురు మూర్ఖులుగా సత్యనారాయణ, రాజబాబు, నాగభూషణం, గుమ్మడి భార్యగా దేవిక, కూతురుగా రోజారమణి నటిస్తున్నారు.

సత్యనారాయణ, రాజబాబు, నాగభూషణం గార్లకు రోజారమణి అక్కయ్యగా నటించడం ఈ చిత్రంలోని విశేషం. ఈ చిత్రానికి కె. హేమాంబరధరరావు దర్శకుడు.

## బంగారు మనిషి

అరకులోయ, విశాఖపట్నం, కాకినాడ ప్రాంతాలలో మూడు పాటలు పిక్చరైజ్ చేయబోతున్నాం. డిశంబర్ రెండవవారం నుంచి, ఆఖరివారం లోపు మా చిత్రం "బంగారు మనిషికి" గామా అన్నారు నిర్మాత పేర్రాజుగారు.

ఆంధ్రుల అభిమాన నటుడు నందమూరి, అభినేత్రి లక్ష్మిగార్ల సాంగ్స్ చిత్రీకరించదలచాం ఈ ట్రిప్‌లో. చిత్రంలోని తారాగణమంతా పాల్గొనే కొన్ని ముఖ్య సన్నివేశాలను కూడా ఈ షెడ్యూల్లో షూట్ చేయడానికి ప్లాన్ చేసాం అన్నారు దర్శకుడు భీమ్‌సింగ్. "ఈ వర్క్‌తో చిత్రం దాదాపు పూర్తవుతుంది. ఫిబ్రవరిలో శ్రీ ఫిలింస్ ద్వారా విడుదల చేయాలనుకుంటున్నాం" అన్నారు నిర్మాత, దర్శకుడు.

## బంధంకన్నా బాధ్యత ముఖ్యం

"బంగారు మనిషి" చిత్రంలో రామారావుగారు కలెక్టర్‌గానూ, గుమ్మడిగారు బంట్రోతుగానూ నటిస్తున్నారు. కలెక్టర్ తండ్రి బంట్రోతు కావడం, బంట్రోతు తనయుడు కలెక్టర్ కావడం, బంధానికి బాధ్యతను ముడిపెట్టకూడదనే సూత్రంపై తండ్రీ, కొడుకులు సంఘర్షణలమధ్య నలిగిపోవడం, సహనంతో సఖ్యంచేసి, నమ్మిన సూత్రాలకు న్యాయంచేయడం లాంటి ఎన్నో రసవత్తర ఘట్టాలతో సాగిపోతుంది "బంగారు మనిషి" వర్ణ చిత్రం.

గొల్లపూడి కలం, మహదేవన్ సంగీతం, విఠల్ కెమెరా, మారన్న శిల్పం "బంగారు మనిషి"కి తోడై, ప్రభాకరరెడ్డి, రావుగోపాలరావు, అల్లురామలింగయ్య, శ్రీధర్, కె. వి. చలం, మిక్కిలినేని, శరత్‌బాబు, రమాప్రభ, హేమాచౌదరి మున్నగువార్ని ముఖ్య భూమికల్లో చూపించబోతూంది.

— **శ్రీనివాస్**



'వజ్రాల దొంగ'లో మంజుల

## డాక్టర్ సలహాలు

**డా॥ కె. వెంకటేశ్వరరావు**

ఎస్. ఆర్. ఎస్. — హుజూరాబాద్

ఉదయము ముఖము కడుగునపుడు 'పసరు' పడుచున్నది. ఈ విధముగా చాలారోజులుగా పడుతున్నది. దీనివల్ల ఏమైనా నష్టమా? యిది ఎలా తగ్గుతుంది.

★ దంతధావన సమయంలో కొందరు నాలుకను శుభ్రపరచటానికిగాను తాటాకు, ప్లాస్టిక్‌తో చేసిన పరికరం, మొదలయినవి వాడడం సహజం. కొందరు తమ చేతివేళ్ళను ఉపయోగించి 'కాండ్రించి' ఉమ్మివేయటం ఒక అలవాటుగా ఏర్పరుచుకొంటారు.

మామూలుగా నాలుక శుభ్రపరిచే సమయంలోనే అక్కడి 'నరాలు' ప్రేరేపింపబడి డోకు (వాంతి) అయ్యేలా వుంటుంది. ఈ శుభ్రపరచటం ఒక మోతాదుని మించితే అప్పుడు, రాత్రి భాగంలో ఎక్కువకాలం కడుపులో ఆహారం పదార్థం లేనందువల్ల అక్కడ తయారయ్యే ఆమ్లములు మాత్రం బయటికి రావటమే మీరు వ్రాసిన "పసరు." ఇది మనంతట మనమే కొనితెచ్చుకొన్న అలవాటుకాబట్టి, నష్టంగాని మందుల అవసరంగాని లేదు!

వి. కె. — కాకినాడ

నా వయస్సు 19 సం.లు. గత రెండు నెలలుగా ఉమ్మిలో బొట్లు బొట్లుగా రక్తము పడుతున్నది. ఈ రక్తము గట్టిగా వుండి సాగుతూ వుంటుంది. దయచేసి నాకు టి. బి. గాని, కేన్సర్ గాని రావటానికి అవకాశము వున్నదా?

★ రెండు నెలలుగా 'ఉమ్మి'లో రక్తం పడుతున్నదంటే వెనువెంటనే పరిశీలించవలసి ఉంటుంది. ఛాతీని 'ఎక్స్‌రే' తీయించటం, ఉమ్మిలోని క్రిములను పరిశీలింపజేయడం ముఖ్యంగాను, అత్యవసరంగాను మీ పరిస్థితిదృష్ట్యా చేయాల్సిన విధులు. వీటి పరీక్షా ఫలితాలను నిపుణులైన వైద్యులకి చూపించి, వారు పరీక్ష చేసిన ఫలితాలను, పై రెండిటి ఫలితాలను సమన్వయించి రోగనిర్ధారణ జరిగిన తర్వాత తగిన చికిత్స ప్రారంభించవలసి వుంటుంది. ఎన్నో కారణాలవల్ల ఉమ్మిలో రక్తం రావటానికి అవకాశం వుంది. వాటిలో కొన్ని మాత్రమే ఆందోళన కలిగించేవిగా వుంటాయి. ఆ రోగాలు లేవని పరీక్ష చేయించుకొని నిర్ణయించుకోవటం ఎప్పటికైనా మంచిదేకదా! మీ వయస్సువారికి "కేన్సర్" రావటం చాలా అసహజం.

ఎం. ఎస్. — హైదరాబాద్

నా వయస్సు 25 సం.లు. ఒక సంవత్సరం క్రితం నాకు జ్వరం వచ్చి 4 రోజుల తర్వాత తగ్గిపోయింది. ఆ నాలుగురోజులూ ఏమీ తిననికారణాన, నాకు మలం పోయే సమయం కష్టంగా వుండి రక్తంకూడా పోవటం మొదలయి, అప్పటినుండి, అప్పుడప్పుడు మలం పోవటం కష్టంగా వుండటం మలంతోబాటుగా రక్తంకూడా రావటం జరుగుతున్నది. కడుపులో నెప్పికూడా ప్రతిరోజూ వుంటున్నది.

★ మలంతోబాటుగా తగినంత నీరులేని సమయంలో మీరు వ్రాసిన లక్షణాలు ఏర్పడతాయి. అంటే 'మలం' మామూలుగాగాక గట్టిపడి వుండటంవల్ల, విసర్జింపబడటం కష్టమవటం, తద్వారా తెరలు — తెరలుగా కడుపునెప్పి రావటం సహజం. ఇదే కారణంవలననే మలం — మలవిసర్జన జరిపే చివరి గొట్టపు గోడలకి అడుగడుగునా తాకిడి కలిగించడంవల్ల, అక్కడి మ్యూకస్‌పొర దెబ్బతిని, అటుతర్వాత దాని క్రింద వున్న రక్తనాళాలు కూడా ఈ మల రాపిడివల్ల పగిలి మలంతోబాటుగానే రక్తాన్ని విసర్జింపజేస్తుంది. మలవిసర్జన సమయంలో నెప్పి, మంట వుంటుంది. ఇలా వున్నవారు ప్రతినిత్యం "లిక్విడ్ పారఫీన్" ఒక ఔన్సు మోతాదు రాత్రి పడుకోబోయే ముందుగా తీసుకోవటం, ఆహారంతోబాటుగా లేక విడిగా మంచినీరు ఎక్కువగా లోనికి తీసుకోవటం అన్ని వైద్యాలకన్నా శ్రేష్ఠం. ఈ లక్షణాలు వున్న రోగాన్ని — "ఫిషర్ ఇన్ ఏనో" అంటారు. దీనికి ప్రత్యేకంగా ఏ మందులూ అవసరంలేదు. పై మార్పువల్ల పరిస్థితిలో మార్పు లేనప్పుడు వైద్య పరీక్ష చేయించుకోవటం అవసరం.

పి. జె. ఎల్. — పెదవేగి

నా వయస్సు 22 సం.లు. వివాహమయి 6 సం.లు అయినది. నాకు కాళ్ళ చేతులు లాగుట, నడుమునొప్పి, నీరుడు అధికముగా అగును. రాత్రులందు నిద్రపట్టదు. నీరసముగాను, గుండె నొప్పిగాను వుండును. కడుపునొప్పి కూడా వుండును. ఈ లక్షణములకు ఏమి మందులు వాడవలెను?

★ మీరు వ్రాసిన లక్షణాలను పరిశీలిస్తే రక్తంలోని హిమోగ్లోబిన్ అనే "ఇనుపధాతువు" లోపించి వుండటంవల్ల రాగల "అనీమియా" అనే రోగం మీకు వున్నదని తెలుస్తున్నది. శరీరావయవాలు సరిగా పని చేయటానికి, ఆ అవయవాలలోని జీవకణాల (సెల్స్)కు, ఆహారం, ఆక్సిజన్ అనే రెండూ చాలా అవసరం. ఈ రెండూ కలిసి, ఆహారంలోని 'సత్తువ'ను దహింపచేయటం వలననే ఆ అవయవాలకు 'శక్తి' అనేది ఏర్పడుతుంది. ఈ రెండింటిలో ఏది లోపించినా మీరు వ్రాసిన లక్షణాలు ఏర్పడే అవకాశం వుంది. రక్త పరీక్ష చేయించుకొంటే నెత్తురులోని హిమోగ్లోబిన్ ప్రమాణం తెలుస్తుంది. మామూలుగా స్త్రీలకు 14.5 గ్రాములు, పురుషునికి 15.0 గ్రాములు అనే తీరులో ఈ హిమోగ్లోబిన్ వుంటుంది.

యస్. యన్. పి. — విద్యాధరపురం

నాకు కుడిచెవి మీద ఎర్రగా కందినట్లుగా కాయకాచినది. ఇది నాలుగు నెలల నుండి వున్నది. మందులు వాడినా ప్రయోజనము కన్పించలేదు. చూచుటకు చాలా అసహ్యముగా నున్నది. దీనికి ఏదైనా సలహా చెప్పండి.

★ చెవిమీద చర్మంలో యెర్రగా కాయలాగా లేవటం అనేది నాలుగు నెలలుగా మాత్రమే వుంటే అది రక్తనాళాల సమన్వయమైనాగాని (హెమాన్‌జియోమా); లేక సెబేషియస్‌సిస్ట్‌గాని అయి వుంటుంది. (అంటే స్వేదనాళంలో అడ్డు ఏర్పడటంవల్ల స్వేదం పేరుకుపోయి దానిలోని నీరు యెండిపోవటంవల్ల మిగిలిన లవణాల కూడిక.) చూడటానికి అసహ్యంగా వుంటే దీనిని శస్త్రచికిత్స ద్వారా తీసివేయటంతప్ప వేరే మార్గం లేదు.



ఫొటో పంపినవారు : బి. పి. రెడ్డి హైదరాబాద్

# ఊహాతీతమైన రంగులు
# ఉవ్విళ్ళూరించే డిజైన్లు

బెయిజ్ కలర్‌లో 14 ఛాయలు, డిజైన్లు– ఈ కలర్‌ను అందించే ధైర్యం ఏ మిల్లులకి ఉంటుంది మరి ? పాలియెస్టర్ మరియు పాలియెస్టర్ మిశ్రిత బట్టలలో ఆకర్షణీయమైన 260 ఛాయలు మరియు డిజైన్ల శ్రేణి–నేటివరకూ ఎవరూ, ఎక్కడా, ఎప్పుడూ సమకూర్చని విస్తృత శ్రేణిలో ఇవి కేవలం ఒక భాగం మాత్రమే.



**మదురా బట్టలు**

మదురా కోట్స్ వారి ఉత్పాదన

# ప్రశ్నావళి — కె. రామలక్ష్మి

ఎస్. బి. — కొమెరెపూడి

స్త్రీలు ఎప్పటికీ పురుషులతో సమాన హక్కులను పొందలేరు అంటాను...

★ కాస్త వేచిచూడమంటున్నానందుకే.

పి. ఎస్. ఆర్. — సికింద్రాబాదు

పతి హృదయమే నిత్యసత్యమైన దేవాలయం.

★ నిజమే. కాని ఆ దేవాలయం కూడా యీనాటి మన దేవాలయాలలాగా అపరిశుద్ధంగా వుంటె ఇల్లాలు పరిశుభ్రపరచుకోవాలని ప్రయత్నించడం తప్పు కాదుకదా ? !

టి. ఎమ్. ఎస్. ఆర్. — కడప

మగవానిపై ఎందుకింత పగ ? మిమ్మల్ని స్వయంగా చూడాలనివుంది.

★ ఎందుకు — కత్తి నూరుతూ కలకత్తా కాళిక నాలిక పదునుపట్టుతూ వుంటాననా ? లేక యింత పెద్ద కబుర్లు చెప్పే కె. రా. తలుపు వెనక నక్కి 'వారు లేరు.' అనేసి తలుపేసేసి పోతాననా?!

ఎమ్. ఎస్. పి. — సూళ్లూరుపేట

1976 పురుషుల సంవత్సరంగా ప్రకటిస్తారట. వ్యతిరేకిస్తారా ?

★ పాపం ! ఎందుకు వ్యతిరేకించడం — మీ సమస్యలు మీకూ వుంటాయికదా ... ఒకే పెళ్ళాం ఏమిటి ? ఇద్దరూ లేక ముగ్గురే పెళ్ళలేమిటి ? పెళ్ళాన్నిష్టం వచ్చినప్పుడు వదిలేసే హక్కు లేకపోవడమేమిటి ? యీ విడాకుల తతంగం ఏమిటి — వదిలేస్తే పోదా...?చాలావుంటాయిసమస్యలు—మీకూ.

వయస్సుకు మాలతీచందూర్ పెద్దా ? మీరు పెద్దా ?

★ మా యిద్దరికీ వయస్సు పెరగదు. ఎందుకంటారా ? మా మనస్సులెప్పుడూ యౌవ్వనదశ దాటిపోవు.

జి. ఆర్. — చిర్‌బన్‌బాగ్

మీ మైనస్‌లు కూడా కథలు రాస్తారని విన్నాను.

★ నాకు మైనస్‌లు లేరు. కొడుకులుంటే కద పండిత పుత్రులవుతారు ? నా కూతుళ్ళు తెలివైనవాళ్ళు.

జె. ఎ. ఎన్. — బెంగుళూరు

ఏమండీ కె. రా. గారూ, 'బడికి' 'ఒడికి' తేడా ఏమిటి ?

★ ఏం లేదు. బడిలో మెదళ్ళు, ఒడిలో మనస్సు పెరుగుతాయి.

ఎమ్. వి. వి. — కాకినాడ

సృష్టిలో తీయనిది స్నేహమేనోయీ, అంటారు. మీరు స్వార్థానికీ ప్రధాన్యం ఇచ్చి స్త్రీలనే పొగుడుతారు.

★ అయ్యో, కొత్త స్లోగన్ వినలేదా ? సృష్టిలో తీయినిది స్వార్థమేనోయీ ! అని.

జె. ఎ. హెచ్. - ద్రోణాచలం

ప్రపంచంలో పిలువబడే మంచికి నిర్వచనం ?

★ సాటి మనిషిని మనిషిగా చూడడమే మంచితనం. తెలిసి తెలిసి ఎవరికీ హాని తలపెట్టకపోవడమే మంచితనం.

ఎస్. వి. - గుత్తి

మనస్సులో బాధను ఎలా పోగొట్టుకోవాలి ?

★ పనిలో తప్పించి బాధ మరిచిపోలేం.

ఎస్. ఎమ్. ఆర్. — రాజాం

జీవాత్మకి పరమాత్మకి మధ్య దూరం ఎంత ?

★ దూరం లేదు.

నేటి సమాజంలో స్త్రీ ప్రతిభ చూస్తే నా కెంతో ఏవగించుకొన్నట్లుంది.

★ అది మీబోటి చీకటి మనసులకి సహజమే కదా. ఇన్నాళ్ళుగా, పడివుండే ఆడదాన్నే చూసిన మీకు యీ తరం కాస్త తలెత్తడం ఏవగింపుగానే వుంటుంది.

ఎమ్. ఆర్. — ఆకివీడు

డబ్బు విలువ తెలియనివాళ్ళ కెలా చెప్పాలి.

★ కానీ చేతిలో పెట్టకుండా నాలుగణాలు అప్పు తెచ్చి చూడమంటమే !

ఆర్. పి. ఆర్. — బోనకల్లు

ఆత్మాభిమానానికి అహంకారం తోడయితే ఏమవుతుంది ?

★ అన్యాయం కంటపడితే నరకడానికి కూడా వెనుకతీయని ధైర్యం వస్తుంది.

జి. వి. ఆర్. - హైద్రాబాదు

బాగా వున్నవాళ్లే యీ మధ్య మొక్కుకున్నాం అంటూ ముష్టికొస్తున్నారు ?

★ అపాత్రదానం — దారి తప్పిన న్యాయం లాంటిదే. లేదు పొమ్మనాలి.

ఇ. జె. ఎస్. — విజయనగరం

చూడండి. భారతదేశంలో అనాదిగా స్త్రీ గౌరవింపబడుతోంది...

★ అనాదిగా గౌరవించబడ్డ సంగతి మన పతివ్రతల గాథలన్నీ ఘోషిస్తూనే వున్నాయి. మేం కోరేది — బ్రతుకుతున్న యీ వర్తమానంలో స్త్రీని ఎలా చూస్తున్నారన్నది... భూతకాలంలో తెగ గౌరవించాం యిప్పుడెందుకు అంటారా ?!

ఎస్. ఆర్. — వరంగల్

ఆడపిల్ల నవ్వితే తప్పు. ఏడిస్తే తప్పు. సిగ్గుపడితే తప్పు. పడకపోతే తప్పు. ఎలా ?

★ నవ్వవలసినప్పుడు వెకిలిగా, ఏడ్చినప్పుడు విపరీతంగా, సిగ్గుపడినప్పుడు అతిగా... ప్రవర్తిస్తేనే... వింతపడతారు. సందర్భశుద్ధి కల్గి ప్రవర్తిస్తే — ఎవరేం అంటారు ? ఏమీ అనరు.

డి. హెచ్. పి. — భువనేశ్వరం

కె. రా. గారూ మీ తీరని కోరిక ఏమిటి ?

★ ఇంకా ఏం లేదు !

అంతర్జాతీయ మహిళా సంవత్సరంలో మీలాంటి వారు పాల్గొనక పోడానికి కారణం ?

★ ప్రభుత్వపు దృష్టిదోషం. ఆశ్రితుల సంఖ్య అధికం అయి వడ్డించేవారికి ముక్కు దాటి దృష్టి సారించే అవకాశం రాకపోవడం. 'ఇదెలాగా ఉత్సవ వేడుకగా చేసేదే' కదా అని వందిమాగధులకే అవకాశం యిస్తే — అటు వారికి సంతృప్తి, యిటు వీరికి భజన కూట బలం కలిసివస్తుంది... ఇలా నానా కారణాలుండి నిజంగా స్త్రీ సంక్షేమం కోసం ఏవో ఆలోచనలున్నవారికా సంఘంలో అం. ప్ర. [illegible] స్థలం లేకుండా చేసింది.

"స్వర్గాడు"లో ఒక దృశ్యం

చనిది ఇచ్చి ఏదురుచూడని రాజయోగాన్ని పట్టించినా, తాను తలచినది కాలేదే ? అన్న భావన మనిషిని అప్పుడప్పుడు బాధిస్తూనే వుంటుంది. ఆవిడ విషయంలోనూ అలాగే జరిగింది.

ఒకనాడు అదృష్టదేవత అరుంధతి వుంటున్న ఊర్లోకి ప్రవేశించింది. ఆ ఊర్లో అందరి తలుపులు తట్టి, తనకు కావలసిన వ్యక్తి దొరక్క విసుగుదలతో తిరిగి వెళ్లిపోబోతూ, ఆఖరిసారిగా అరుంధతి వాళ్ల ఇంటి తలుపు తటింది.

"ఆఁ వస్తున్నా" అంటూ తలుపు తీసిన పద్దెనిమిదేళ్ల మెరుపు తీగలాంటి పిల్లను చూసి "ఓహో! ఇక్కడున్నావా ?" అంటూ కౌగిలించుకుంది.

అప్పుడే వచ్చింది అరుంధతి వాళ్లింటికి, సుభద్రమ్మ. సుభద్రమ్మ ఎవరింటేనా అడుగు మోపితే, వారిల్లు పావనమైనట్లు భావిస్తారందరూ. ఆడపిల్లల తల్లితండ్రులు మరీను. కారణం, ఆవిడ, ఐ. ఎ. స్ పాసై ట్రైనింగ్ అవుతున్న పెళ్లికాని చాకులాంటి కుర్రాడికి తల్లి కావడం. ఆవిడ కరుణా కటాక్ష వీక్షణాలు ఎవరిమీద ప్రసరిస్తాయా? అని అందరూ ఆత్రుతగా ఎదురు చూస్తున్నారు.

అలాంటి తరుణంలో వచ్చిన సుభద్రమ్మను చూసి తబ్బిబ్బైపోయారు, అరుంధతి తల్లితండ్రులు. ఆ ఊళ్లో పెళ్లికి వచ్చిన ఆ దూరపు చుట్టం, ఆ ఇంట్లో మూడు రోజులుంటుందని తెలుసుకుని ముచ్చటపడి పోయారు.

ఇంటికి చుట్టాలొచ్చారంటే అరుంధతికెంతో సంబరం. ఆవిడకి ఇల్లంతా చూపించింది. ఆ రోజు మధ్యాహ్నం ఆవిడ పక్కనే కూర్చుని కబుర్లు చెపుతూ భోంచేసింది. లైబ్రరీ నుండి తెచ్చిన నవలలు చదవడానికి ఇచ్చింది. తన గదిలోనే ప్రత్యేకంగా మంచం వేయించి, పాల నురుగులాంటి తెల్లటి దుప్పటి పరచి, ఆవిడ పడుకోవడానికి ఏర్పాటు చేసింది. సాయంత్రం నిద్ర లేచేసరికి టిఫిన్ కాఫీలు ఇచ్చింది. ఆ తర్వాత పొలం గట్టు మీద షికారుకి తీసుకెళ్లింది. ఆ ఊర్లోని తోట, గుడి, కూలిపోతున్న చారిత్రాత్మకమైన కోటగోడలు చూపించింది.

స్వయంగా ఆవిణ్ణి, ఆ ఊర్లో వున్న

## అరుంధతీ ఆంధ్రా మెట్రిక్

(18వ పేజీ తరువాయి)

బంధుమిత్రుల దగ్గరకు తీసుకెళ్లింది. రాత్రిపూట రామాయణాన్ని చదివి వినిపించింది.

అరుంధతి చూపే ఈ శ్రద్ధకు ముగ్ధురాలైపోయిందావిడ.

పెళ్లినాడు తెల్లవారు ఝామునే నిద్రలేచి తయారై, ఆవిణ్ణి పెళ్లి వారింటికి తీసుకెళ్లింది.

పెళ్లివారింట్లో ఆహూతులకు గంధం రాసి, పన్నీరుజల్లి, ఆహ్వానించడం దగ్గర్నుంచి; తాంబూలాలిచ్చి వీడ్కోలు చెప్పడం వరకు గల రక రకాల పనుల్ని తనకు తానే పురమాయించుకొని, అందరి తలల్లో నాలుకగా మసలుతూ, ఎక్కడ చూసినా తానే అయి మెరుపుతీగెలా కనిపించే అరుంధతిని చూసిన సుభద్రమ్మ ముచ్చటపడి పోయింది.

"అంత పని మంతురాలు, బుద్ధిమంతురాలు అయిన ఆ పిల్లను, ఇక ఆ అనామకమైన పల్లెలో వుంచడానికి ఎంత మాత్రం వీల్లేదని" ఒక నిర్ణయానికి వచ్చింది. అలా నిర్ణయానికి రావడమే తడవుగా, ఐ. ఎ. యస్. పాసై ట్రైనింగవుతున్న కొడుక్కి "అబ్బాయి ! వెంటనే రెక్కలు కట్టుకుని ఇక్కడ వాలు" అని టెలిగ్రాంలాంటి ఉత్తరం వ్రాసి పడేసి, ఆ ఇంట్లో ఇంకో రెండు రోజులుంటానంది.

తల్లి మాట జవదాటని, ఆ కుర్రాడు వెంటనే చెంగున రెక్కలు కట్టుకుని వాలాడు.

"ఒరేయి ఆ అమ్మాయిని సరిగ్గా చూడు" అని ఎవరూ లేకుండా చూసి కొడుక్కి, చిన్న సూచన చేసింది.

అతను ఒళ్లంతా కళ్లు చేసుకుని ఆ అమ్మాయిని చూసాడు. కళ్లు మిరుమిట్లు కొలిపే. ఆ అమ్మాయి అందం అతణ్ణి ముగ్ధుణ్ణి చేసింది.

"ఎలా వుందిరా ఆ అమ్మాయి" మరునాడడిగిందావిడ.

"ఎందుకు ?" అడిగాడతను.

"ఎందుకేమిటి నీ ముఖం. ఏతల్లైనా కొడుక్కి ఓపిల్లను చూపించి 'ఎలా ఉంది?' అని ఎందుకడుగుతుంది ?" ఎదురు ప్రశ్న వేసింది.

బోల్డు సిగ్గు పడిపోయాడా కుర్రాడు.

"పెద్ద ఉద్యోగస్థుడవు కాబోతున్నావు. ఎన్నాళ్లు వంటరిగా వుంటావు? ఈఏడాది నీ పెళ్లి చేసేద్దా మనుకుంటున్నాను. ఈపిల్ల అందర్లోకి పనిమంతురాలు, బుద్ధిమంతురాలులా వుంది. పైపెచ్చు ఎంతో అందంగా వుంది. చూశావుగా"

"ఏం చదువుకుందమ్మా ?" ఆఖరుకి నోరు మెదిపాడు.

"స్కూలుఫైనల్ పోయిందటరా, ఇప్పుడు ఇంటి దగ్గర కూర్చుని మెట్రిక్ పరిక్షకి తయారవుతోంది"

అతని ముఖం ఆముదం తాగినట్టుగా అయింది.

"ఏం అలా వున్నావు ?"

"ఏం లేదు. మరీ తక్కువగా చదువుకుందేమో అని"






## 2-1-1976 శుక్రవారం మొదలు
## 8-1-1976 గురువారం వరకు

**మేషం:—** వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కలుసుకొంటారు. ప్రయాణాలు ఫలిస్తాయి. సాహిత్య కళారంగాల్లో మీ కృషి రాణిస్తుంది. వ్యాపారంలో నూతనావకాశాలు లభిస్తాయి. సాహసిక వ్యవహారాలు బాగుంటాయి. స్త్రీలకు—దైవకార్యాలు నెరవేరతాయి. అలంకార వస్తువులు కొంటారు.

**వృషభం:—** నూతన వ్యవహారాలు లాభిస్తాయి. మిత్రులకు సహాయం చేస్తారు. సంతోషకరమైన వార్తలను వింటారు. ప్రయోజనం గల సంభాషణలను జరుపగలరు. స్థిరాస్థి వ్యవహారాలు బాగుంటాయి. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. స్త్రీలకు—ఆరోగ్యం బాగుంటుంది. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**మిథునం:—** సాహసిక వ్యవహారాల్లో నష్టం వస్తుంది. వృత్తిలో ఎవరినీ విశేషంగా నమ్మడం తగదు. వారం మధ్యలో మీ కార్యక్రమాలు బాగుంటాయి. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. నూతన విషయాలను తెలుసుకొంటారు. స్త్రీలకు—కుటుంబ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది. బంధుమిత్రులను కలుసుకొంటారు.

**కర్కాటకం:—** భాగస్వాములతో కలిసిచేసే వ్యాపారాలు బాగుంటాయి. ప్రయాణాలు ఫలిస్తాయి. వారం మధ్యలో వ్యతిరేకమైన పరిస్థితి ఏర్పడుతుంది. ఉద్యోగంలో కార్యభారం పెరుగుతుంది. ఆందోళనకు గురికాగలరు. స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. అనవసరమైన వ్యయం చేస్తారు.

**సింహం :—** పోటీవారితో వాద ప్రతివాదాలు తగవు. అనవసరమైన సందేహాలు కలుగుతాయి. వారం మధ్యలో ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి. మీ ప్రయత్నాలు సులువుగా నెరవేరతాయి. ప్రయోజనం గల వ్యక్తులను కలుసుకొంటారు. స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. దైవకార్యాలు నెరవేరతాయి.

**కన్య :—** వృత్తి వ్యాపారాలు ప్రోత్సాహకరంగా ఉం

---

"నీ మొఖం. అయినా ఆడపిల్లలకి కావలసింది సంస్కారం కాని చదువెందుకురా? డిగ్రీలు పాసై నీ భార్య ఉద్యోగం చెయ్యాలా? ఊళ్ళేలాలా?, ఆ చేసేది, ఏలేదీ నువ్వేగా? నీ ఇంటిని, ఇంట్లో మనుషుల్ని జాగ్రత్తగా చూసుకునే మనిషైతే చాలు. నీకు తెలియదేమోగాని, ఆ అమ్మాయిని కలెక్టర్‌గా చేస్తే, నీ కన్నా బాగా పాలించగలదు. **ఆలోచించు.**"

అతను ఆలోచించాడు. ఎడతెరిపిలేకుండా, రోజున్నర ఆలోచించాడు. అలా ఆలోచించిన కొద్దీ ఆ అమ్మాయిలోని ఆకర్షణ పెరిగిపోసాగింది. ఆఖరికి "సరే" అన్నాడు.

తనకి పెళ్ళన్న సంగతి తెలుసుకున్న అరుంధతి నివ్వెరపోయింది. తల్లి దగ్గరకెళ్ళి "నిజమేనా అమ్మా?" అని అడిగింది.

"నువ్వు అదృష్టజాతకురాలివే, చిన్నప్పటి నుంచి శాస్త్రులుగారు నీకు రాజయోగం వుందని చెవులో ఇల్లుకట్టుకుని పోరుతుంటే నమ్మలేదు" అందావిడ ఆప్యాయంగా మెటికలు విరుస్తూ.

"అదేమిటమ్మా, నాకిప్పుడే పెళ్ళేందుకు?" అంది మారాంగా.

"అదేమిటే నువ్వేమన్నా చిన్నదానివా? చితకదానివా? పద్దెనిమిదేళ్ల వయస్సొచ్చింది. ఇప్పుడు కాకపోతే ఇంకెప్పుడు చేసుకుంటావు పెళ్ళి."

"నామెట్రిక్ పూర్తయ్యాక అయితే బాగుంటుంది."

"వెధవ మెట్రిక్ ఎప్పుడేనా పూర్తవుతుంది. అసలవ్వకపోయినా పర్వాలేదు. ఆ అబ్బాయి ఏమిటో తెల్సా, కలక్టరవబోతున్నాడు. ఆ అబ్బాయికి పిల్ల నివ్వాలని ఎంత మంది వువ్విళ్ళూరుతున్నారో తెల్సా? సుభద్రమ్మ నిన్ను కోడలుగా చేసుకుంటాననంటే అది నీ అదృష్టం. ఏ ఆలోచనలూ పెట్టుకోకుండా సంతోషించు" అని పంపించిందావిడ.

తెల్లటి లాల్చీ, పైజామాతో ఠీవిగా పల్లెలో తిరుగుతున్న రాజకుమారుడులాంటి ఆ అబ్బాయిని పరిశీలనగా చూసిన అరుంధతికి మతి పోయింది. ఆ కళ్ళలో చురుకుదనం, ఆ విగ్రహంలో నిండుదనం, నుదుటిమీద పడుతున్న ఆ ఉంగరాల జుట్టులో చిలిపితనం ఆమెను ఆకట్టుకున్నాయి. అంగుళం, అంగుళం మగసిరి వుట్టిపడుతున్న ఆసుందర రూపాన్ని చూసిన ఆ కన్నె మనసు పులకించిపోయింది. "వెధవ మెట్రిక్ పూర్తి కాకపోతుందా? దీనికోసం పెళ్ళి వాయిదా వెయ్యడం ఎందుకు?" అనుకుంది

దానికి సాయం, కాబోయే కోడలు పిల్ల మనసు తెలుసుకున్న సుభద్రమ్మ, ఆమెను దగ్గరికి పిలిచి, "పెళ్ళయితేమాత్రం చదువుకోకూడదా? అక్కడే చదువుకుందువుగాని, మా ఇంట్లో పూచిక పుల్లకూడ ముట్టుకోవాల్సిన అవసరం లేదు. చదువుకోడానికి కావలసినంత ఖాళీ" అని ధైర్యం చెప్పింది.

ఈ సంగతి ఊళ్ళో ఎలా తెలిసిందో, ఆ పల్లె యావత్తూ అరుంధతి అదృష్టానికి నీరాజనం అర్పించింది. రచ్చబండ దగ్గర, నూతి పళ్ళెందగ్గర, చెఱువుగట్టు దగ్గర, కొళాయిల దగ్గర, గుడిదగ్గర జరిగిన చర్చల్లో ఈ విషయం పదే పదే దొర్లింది.

ఒక శుభ ముహూర్తాన శుభలగ్నంలో అరుంధతి, విద్యాసాగర్ల వివాహం జరిగిపోయింది. పెళ్ళి తంతు ముగిసింది. వరు

# అరుంధతీ ఆంధ్రా మెట్రిక్

డుగా విద్యాసాగర్ అందర్నీ ఆకర్షించాడు. అందరి మనసుల్ని చూరగొనే విధంగా వరుడుగా తన విధుల్ని నిర్వర్తించాడు. అరుంధతి అదృష్టాన్ని అందరూ వేనోళ్ల కొనియాడేలా ప్రవర్తించాడు. అరుంధతి సిగ్గుల మొగ్గగా మారిపోయింది. ఇరవై వేల రూపాయల కట్నంతోపాటు, తనలో వికసించి తేనెలూరుతున్న యవ్వనాన్ని, అంతవరకూ తను ప్రాణప్రదంగా కాపాడుకున్న అపూర్వమైన కన్యత్వాన్ని ఆమె అతనికి కానుకగా సమర్పించుకుంది.

అప్పగింతలు పూర్తయ్యాయి. అరుంధతి అత్తవారింటికి చేరింది.

పూచికపుల్ల కూడా ఎత్తనివ్వని అత్తగార్ని తన మనసులో వున్నదాన్ని చెప్పకుండానె పసిగట్టి అమర్చే నౌకర్లని చూసిన ఆమె "ఇది ఇల్లా? స్వర్గధామమా?" అని ఆశ్చర్యపోయింది. కాని అక్కడ ఏపనీ లేక విసుగుపుట్టేది. భర్తకు పోస్టింగై అక్కడకు రావడంతో కావలసినంత కాలక్షేపం దొరికింది.

ప్రతి చిన్న విషయానికి తనని పిలిచే భర్తని చూసి "ఈయన్ని ఎలా పెంచారబ్బా? ఇక్కడ ఇలా వుండే ఈయన ఆఫీసులో ఏం పని చేస్తారు?" అనుకునేది. కాని భర్త ప్రతి చిన్న విషయానికి, తనమీద ఆధారపడి వున్నాడన్న, భావం రావడంతో ఆమె మనసు దూదిపింజలా ఎగిరిపోయేది. అతను ఆఫీసుకి వెళ్ళేంత వరకు ఆమెకు తీరిక వుండేది కాదు. తిరిగి అతను ఆఫీసునుంచి ఇంటికి వచ్చేంత వరకు పుస్తకాలమీద మనసు నిల్చేది కాదు. భర్తతో, గడిపిన, గడపబోయే స్మృతుల

టాయి. నూతన వ్యవహారాలు లాభిస్తాయి. రాజకీయ వ్యవహారాల్లో చికాకులు ఏర్పడతాయి. ఇతరుల నిమిత్తం శ్రమకు గురి కాగలరు. మీ కార్యక్రమాలకు మార్పులు వస్తాయి. స్త్రీలకు—ఆరోగ్యంబాగుంటుంది. ఆడంబరం కోసం వ్యయం జరుగుతుంది.

**తుల:—** ఆర్థిక వ్యవహారాల్లో మొగమాటాలుతగవు ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. వారం మధ్యలో సాహసిక వ్యవహారాలు బాగుంటాయి. విద్యా వైజ్ఞానిక రంగాల్లో మీ కృషి రాణిస్తుంది. వ్యాపారంలో ఆదాయం పెరుగుతుంది. స్త్రీలకు—పుణ్యకార్యాలుచేస్తారు సంతానానికి సౌఖ్య సంతోషాలు లభిస్తాయి.

**వృశ్చికం :—**వ్యాపార విస్తరణ ప్రయత్నాలుబాగుంటాయి. మిత్రులకు సహాయం చేస్తారు. వారం మధ్యలో స్థిరాస్థి వ్యవహారాలు బాగుంటాయి. మీ మంచితనమె మీకు యిబ్బందిని కలిగిస్తుంది. ప్రయాణాలు వాయిదా పడతాయి. స్త్రీలకు—ఆరోగ్యంబాగుంటుంది. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**ధనుస్సు :—** రావలసినడబ్బు అందుతుంది. ప్రయాణాలు ఫలించగలవు. అధికారులవలన జరగవలసిన వ్యవహారాలు బాగుంటాయి. వృత్తిలో పోటీవారిపోటీ తగ్గుతుంది. సాహసిక వ్యవహారాలు లాభించగలవు స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి విలాస వస్తువులు కొంటారు.

**మకరం :—** వృత్తిలో ఆదాయం పెరుగుతుంది. నూతన వ్యవహారాలు లాభించగలవు. విద్యా వైజ్ఞానిక రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. ప్రయోజనం గల సంభాషణలను జరుపగలరు. ఆర్థిక వ్యవహారాలుబాగుంటాయి. స్త్రీలకు—ఆరోగ్యం బాగుంటుంది. నూతన విషయాలను తెల్సుకొంటారు.

**కుంభం :—** కొంత మంది వ్యక్తులు మిమ్మల్ని మోసం చేయడానికి ప్రయత్నిస్తారు. అధికవ్యయం జరుగుతుంది. వారం మధ్యలో వృత్తి వ్యాపారాలు బాగుంటాయి. మీ ప్రయత్నాలు ఫలించవు. ప్రయాణాలోచనలు చేస్తారు. స్త్రీలకు—కుటుంబ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది. బంధు మిత్రులను కల్సుకొంటారు.

**మీనం :—** మీ కార్యక్రమాలు నిరాటంకంగా నెరవేరతాయి. సాహసిక వ్యవహారాలు లాభిస్తాయి. వారంమధ్యలో మీ తాలూకు వస్తువులు పోవచ్చును. వ్యాపారంలో ప్రయాస కలుగుతుంది. మీ ప్రయత్నాలకు ఆటంకాలు వస్తాయి. స్త్రీలకు—ఆరోగ్యం బాగుండదు. శుభ కార్యాల విషయంలో అభి[illegible] సాధిస్తారు.

---

మోహరింపుతో, కలలతో సతమతమై పోయేది. అతని రాకకోసం చకోరంలా ఎదురు చూడ్డంతో సరిపోయేది. తిరిగి అతను రాగానే డ్యూటీ ప్రారంభమయ్యేది.

ఈ ముచ్చటలోపడి, పరీక్ష సంగతి మర్చిపోయింది.

భర్తతోపాటు విందులకు, వినోదాలకీ వెళ్లినప్పుడు కలక్టర్‌గారి భార్య కనీసం మెట్రిక్ అన్నా అవకపోతే భర్తకు అవమానం అనిపించేది.

భర్తకు నచ్చచెప్పి, అతగాడి సహకారం కూడా తీసుకోవాలనుకుంది.

ఒకరోజు, పిండారబోసినట్టున్న పండు వెన్నెల్లో, నైట్‌క్వీన్ మరిమళాన్ని మోసుకొస్తున్న మందపవనాలు, శరీరాన్ని పులకింపచేస్తున్న తరుణంలో. భర్త ఒళ్లో తలపెట్టుకుని పడుకున్న అరుంధతి, "నేనీసారి మెట్రిక్ పరీక్ష వ్రాస్తున్నాను. నాకు తెలియనివి చెప్తారూ ?" అని గోముగా అడిగింది.

"ఓయస్ తప్పకుండా ఈరోజే ప్రారంభిద్దామా ?" అని అడిగాడతను.

"మీ ఇష్టం మీరు అలసిపోతే వద్దులెండి. రేపట్నుంచి మొదలెట్టొచ్చు"

"నో. నో. నీకు చెప్పడానికి అలుపేమిటి ఇప్పుడే ప్రారంభిద్దాం"

అతని మాటలు విన్నవెంటనే వెళ్లి తన కిష్టమైన హిందూదేశ చరిత్ర పుస్తకం పట్టుకొచ్చింది. అతను పాఠం మొదలెట్టాడు రెండునిమిషాలు చెప్పి, అమెపైపు చూశాడు. శ్రద్ధగా వింటోందామె. ఆమె కాటుకకళ్లు, నీటిలోని చేపపిల్లల్లా తళతళ మెరుస్తున్నాయి. ఆమె బుగ్గలు యాపిల్ పళ్లలా వున్నాయి. ఆమె చిరునవ్వు నవ్వింది. ఎర్రని పెదాలు దొండపళ్లలా వున్నాయి. మెరిసిన పలువరస పేర్చిన దా[illegible]మ్మగింజల్లా వుంది. పాముకుబుసం లాంటి చీరలో నాగకన్యలా వుందామె.

"ఉఁ చెప్పండి" అందామె అతని ఒళ్లో వాలి.

అతను పుస్తకం పక్కన పడేసి, ప్రేమ పాఠాలు చెప్పడం ప్రారంభించాడు. వయసు పురకలు వేస్తున్న ఆమెకు పుస్తకంలో పాఠాలకన్నా ఆ పాఠాలే నచ్చాయి. ఆపాఠాల్లో ఏ మహాత్మ్యం వుందో ఏమోగాని, "నాకీ పాఠాలొద్దు. చరిత్రలో వున్న — మొగలు సామ్రాజ్య పతనానికి ఔరంగజేబు ఎంతవరకూ బాధ్యుడో చెప్పండి" అని అనలేకపోయింది. ఎప్పుడో పోయిన ఔరంగజేబు, పతనమైపోయిన మొగలు సామ్రాజ్యాన్ని మరచిపోయి, తాము ఏలబోయే మదన సామ్రాజ్యాన్ని గురించి వూహించుకుంటూ, కళ్లు మూసుకుని అతని కౌగిలిలో ఒదిగిపోయింది. అతను నేర్పిన పాఠాలన్నీ నేర్చుకుంది. సందేహాలు అడిగింది. కొన్ని కొన్ని సార్లు అతనికి తెలియనివికూడ చెప్పింది.

ఫలితం మూడు నెలలు తిరక్కముందే ఆమెకి నెలతప్పింది. అనుకోని ఈ పరిణామానికి ఆశ్చర్యపోయింది. పొద్దున్నే వాంతులు, నీరసం వీటితో చికాకు పడిపోయింది. సరిగ్గా పరీక్షల నాటికి తనకి ఎనిమిదవ నెల వస్తుంది. ఇంక పరీక్షేం వ్రాస్తుంది ? ఈ ఆలోచనతో, ఆమెకు మతి పోయింది. తను తొందరగా పూర్తి చెయ్యాలనుకున్న మెట్రిక్ పరీక్ష ఇలా వెనక్కి పోవడంతో, ఆమెకు ఎక్కడలేని నీరసం ముంచుకొచ్చింది.

ఇంతకాలం నుండి, రంజుగా జరుగుతున్న క్లాసులు ఆగిపోయాయి. అత్తగారిదగ్గరకెళ్లి "పెళ్లైతే చదువుకోకూడదా? మాయింట్లో చదువుకుందువుగాని అన్నారు కదా? చూడండి మీ అబ్బాయి ఏం పని చేసాడో" అని చెప్పా మనిపించింది. కాని జరిగిన దాంట్లో తనకీ భాగం వుందన్న సంగతి గుర్తొచ్చి అలాఅడగ లేకపోయింది.

ఈ సంగతి తెలుసుకున్న సుభద్రమ్మ ఎంతో సంబరపడి పోయింది. నౌకర్లకి, చాకల్లకి మిఠాయిలు పంచింది. కోడలికి అలుపు కలిగించే పనులేవీ చెప్పద్దని, కొడుక్కి ప్రత్యేకంగా సూచించింది. అరుంధతిని కాలు కింద మోపనివ్వకుండా అపురూపంగా చూడటం మొదలెట్టింది. అత్తగారి ఆదరణ, యింటి కొచ్చిన అందరి అభినందనల పరంపర; వీటితో ముగ్ధురాలైపోయింది అరుంధతి. తాను తల్లి కాబోతోందన్న అనుభూతి; ఇంట్లో పెరిగిన హోదా; వీటితో తాత్కాలికంగా మెట్రిక్ పరీక్ష సంగతి మర్చిపోయింది.

ఆ తర్వాత కొన్నాళ్లకి, చిగురుటాకుల్లాంటి గుప్పిళ్లను ముడిచి, చింతపిక్కల్లాంటి కళ్లు తెరిచి, బోసినవ్వులు నవ్వే పొత్తిళ్లలో పాపను చూసుకుని మురిసిపోయింది. ఆ పాప సంరక్షణలో ముద్దుమురిపాలలో అన్నీ మరచిపోయింది. ఆ పాపకు నిర్మల అని పేరు పెట్టుకుంది.

నిర్మల కొంచెం పెరిగి, నాయనమ్మదగ్గరే రోజంతా గడుపుతున్నప్పుడు తిరిగి ఆమెలో అణగారిన కోరిక తలఎత్తింది. పుస్తకాలు

తెప్పించి అట్టలువేసి, చదువు మొదలెట్టింది. భర్త సహకారాన్ని అర్థించింది. కాని ఆయన ఇంతకు ముందులా కాకుండా, "రాత్రిపద్దైనా ఇంకా చదువేంటి. ఆ లైటు ఆర్పేసి ఇలా మంచంమీదకి రా" అంటూ డిమాండు చేసాడు.

"ఆ రోజులు వేరమ్మాయి. స్టూడెంటుగా వున్నప్పుడు ఎంత సేపైనా చదువుకోవచ్చు. కాని పెళ్లయ్యాక ఎంతసేపు చదువుకోనిస్తే, అంతసేపే చదువుకోవాలి. చూడు నేను ఆఫీసుకెళ్లాక నీ ఇష్టం వచ్చినంత సేపు చదువుకో. అంతేగాని నేను యింట్లో వున్నప్పుడు పుస్తకం పట్టుక్కూర్చోకు. నాకేం తోచదు. మంచిదానివి కదూ!" అంటూ మారాం చేశాడు.

"పగలు పిల్లదాని అల్లరితో కుదరడం లేదు"

"రాత్రి పెద్దవాడి అల్లరితో అసలు కుదరదు. పగలు పిల్లల్ని, రాత్రి పెద్దల్ని సంతృప్తి పరచవలసిన బాధ్యత వుంది కదూ, మీ ఆడవాళ్లకి. అయినా నీకు చదువెందుకు చెప్పు. హాయిగా వుండక." అంటూ లైటార్పేసి, మంచం దగ్గరికి లాక్కుపోయే భర్తనుచూసిన అరుంధతికి కోపం వచ్చింది.

"తను 'కలక్టరుగారి భార్య'గా తప్ప. 'అరుంధతి'గా పేరు తెచ్చుకో కూడదు కాబోలు. ఈ మొగాళ్ల కిదేం కుళ్లు" అనుకుంది నిస్పృహయింగా.

ఇక ఆయనతో లాభం లేదని, అత్తగార్నడిగి ఒక ప్రవేటు మాష్టార్ని పెట్టుకొని, పగలే చదువు సాగించడానికి ప్రయత్నించింది.

పరీక్షలింకా నెల రోజులున్నాయనగా, అత్తగారికి తీవ్రంగా సుస్తీ చెయ్యడంతో, ఆవిడ్ని హాస్పటల్లో చేర్పించింది. తనని కన్న కూతురుకన్న మిన్నగా చూస్తున్న అత్తగారి ఆరోగ్యం కోసం చదువుకి స్వస్తి చెప్పి, అహర్నిశలు ఆవిణ్ణే కనిపెట్టుకుని సేవలు చేసింది. దాంతో పరీక్షకి 'గుడ్‌బై' చెప్పవలసి వచ్చింది.

ఆ తర్వాత నాలుగు నెలలకి రవి కడుపులో పడ్డాడు. ఇక తనకి మెట్రిక్ పూర్తిచేసే యోగ్యత లేదనుకుని, అరుంధతి దాన్ని మరచిపోయి తన దృష్టిని సంసారం వైపు మరల్చింది.

రవి పుట్టిన రెండు నెలలకి అత్తగారు పోయింది. ఆమెకి బాధ్యత పెరిగింది.

**రాలిన ముత్యాలు**

........శ్రీ సోమసుందర్........

చల్లని కోనేటి నడుమ
చెంగల్వలు విరిసినట్లు —
మంచి మనసులో చక్కని
తలపులు పురిడించుచుండు!

# అరుంధతీ ఆంధ్రా మెట్రిక్

ఆ తర్వాత రెండేళ్లకి శ్యామల, మూడేళ్ల తర్వాత శీను వాళ్ల సంసార నౌకలోకి ప్రవేశించారు. ఆ పిల్లల సంరక్షణ, అంత పెద్ద ఇల్లు, పెద్ద ఆస్తి, వీటిమీద శ్రద్ధ వహించటం; ఆ సంసార తాపత్రయంలో ఆమెకి పరీక్ష గురించి ఆలోచించే అవకాశమే కలగలేదు.

ఆ సంసార సాగరాన్ని ఈదుతున్న అరుంధతి, ఒకనాడు అద్దంలో తనను తాను చూసుకుని ఆశ్చర్యపోయింది. పెళ్లయిన పన్నెండేళ్లల్లో, తను అంతకు ముందున్న దానికి మూడు రెట్లు లావుగా మారిపోయింది. "నువ్వెంత అందంగా వుంటావు అరూ" అంటూ తనను దగ్గరకు తీసుకుని పరవసించే, భర్త మాటలచే మంత్రించబడి, తన అందాన్ని గురించి ఎప్పుడూ పట్టించుకోలేదు. ఎంత లావుగా మారిపోయింది తను! తన భర్త మాత్రం, కాస్త ఒళ్లు చేసినా పెద్దగా మారలేదు.

వెంటనే ఒకపూట అన్నం మానేసి చపాతీలు తినడం ప్రారంభించింది. ఉదయం, సాయంత్రం ఇంటిచుట్టు పదిసార్లు నడిచింది కాని ఫలితం కనిపించలేదు సరే ఇక ఒళ్లు తగ్గదని, నిశ్చయించుకుని, శరీరంతో పాటు మనసుని కూడ విశాలం చేసుకోవాలనుకుంది. అలాగే విశాల హృదయంతో అందరికీ సహాయపడి, అందరి ప్రశంసలు అందుకుంది. ఎంతో మంది బంధువుల పిల్లల పెళ్లిళ్లు, తను దగ్గరవుండి, పలుకుబడి వుపయోగించి చవకలో ఘనంగా చేయించి, వారి పాలిట అరుంధతీ నక్షత్రంగా మారింది. ఎంతో మంది బంధువులు ఆ ఊరు వచ్చి, ఆవిడ దగ్గర వుండి వైద్యం చేయించుకున్నారు. అలా అందరికీ సాయపడి "అరుంధతి పసుపు కుంకుమలతో పదికాలాలపాటు వర్ధిల్లాలి" అని ఆశీస్సులు అందుకుంది.

తాను సాధించలేనిదాన్ని పిల్లలైనా సాధించాలని ఆవిడ పట్టుదలగా పిల్లల్ని క్రమశిక్షణలో పెంచింది. భర్త ఉద్యోగ దృష్ట్యా ఊర్లు మారినా, ఒకే రాష్ట్రంలో కాబట్టి పిల్లల చదువుకి ఇబ్బంది కలగలేదు. స్కూల్లో సరిగ్గా చెప్తారో, చెప్పరో అని ఎప్పటికప్పుడు, ప్రవేట్ మాష్టర్ని పెట్టేది.

"మీకు నామీద దయకల్గి నెలకు పాతికో, పరకో ఇవ్వాలనుంటే ఇవ్వండి, అంతేకాని మీ పిల్లలకి ట్యూషన్ ఎందుకు చెప్పండి" అనేవాడాయన. అయినా వినిపించుకునేది కాదు.

పెద్దమ్మాయి నిర్మల స్కూల్‌ఫైనల్‌లో జిల్లా మొత్తానికి ఫస్ట్‌గా వచ్చినప్పుడు, అరుంధతి కళ్లు చమర్చాయి. తాను సాధించలేనిదాన్ని అమ్మాయి అవలీలగా సాధించడం, ఆవిడకు గర్వకారణం అయింది.

రవి ట్వెల్త్‌క్లాస్‌లో మొత్తం రాష్ట్రానికి ఫస్ట్‌గా వచ్చినప్పుడు — వాడికి, వాడితోపాటు తల్లితండ్రులకు లయన్స్‌క్లబ్‌వాళ్లు సన్మానం చేసిన రాత్రి, తనను గుండెలకు హత్తుకుని కళ్లనీళ్లు నింపుకున్న 'అమ్మ' ను చూసి ఆశ్చర్యపోయాడు రవి.

శ్యామల కూడ యస్ యస్. సి; ఇంటర్ ఫస్ట్‌క్లాసులోనే పాసైంది.

చివరివాడు శీను మొదట్నుంచీ తల్లిచాటు బిడ్డడు.

"అమ్మా ఈ పారం అప్పచెప్పించుకో" అంటూ తన చుట్టూ తిరిగే వాణ్ణి చూసినప్పుడు, ఆమెకీ పరీక్ష వ్రాయాలనిపించింది.

వెంటనే ఫీజు కట్టి, పుస్తకాలు కొని స్వత్రప్రాయంగా చదువుకి శ్రీకారం చుట్టింది. రవి శలవలకి ఢిల్లీ నుండి ఇంటికి వచ్చినప్పుడు "ఒరేయి లెక్కలు చెప్పరా" అని అడిగింది. వాడు రోజూ మధ్యాహ్నం రెండు గంటలు కూర్చుని ఆవిడచే లెక్కల్లో అన్ని అభ్యాసాల్ని చేయించాడు. అప్పుడన్నీ అర్థమైనట్టే అనిపించాయి. శలవలైపోయి అబ్బాయి వెళ్లిపోయి నప్పట్నుంచి, పరిస్థితి మళ్లీ మొదటికొచ్చింది.

శీనుని పిల్చి "ఒరేయి శీనూ, ఈ లెక్క ఎలా చేస్తారా" అని అడిగేది. వాడు కూర్చుని ఎంత బోధపరిచినా అర్థమయ్యేది కాదు. దాంతో "పాపం వాడి టైం వృధా

# మీ తల్లిఇచ్చిన సలహాను నమ్మండి

**మీ పాప ఏడ్చినపుడు,**
**మీ అమ్మమ్మ చెప్పినట్లుగానే,**
## వుడ్‌వార్డ్స్ గ్రైప్ వాటర్
**వాడమని చెపుతుంది.**




**100** ఏళ్లుగా మాతృలోకం విశ్వసించినది



OPCM-1-75 TEL

చెయ్యడం ఎందుకు ?" అనుకుని అడగడం మానేసింది.

అలాగే ఎలాగో పరీక్షలు వ్రాసింది. భార్య ప్రయత్నాన్ని మెచ్చుకునో, లేక పెద్ద ఆఫీసర్ భార్య పరీక్ష పోవడం అవమానం అనుకునో; ఆవిడ భర్త, ఆవిడ నెంబర్ డైరీలో నోట్‌చేసుకుని ఏ పేపర్ ఎవరు దిద్దుతారో తెలుసుకుని, తన ఫోన్‌కి పని చెప్పాడు. ఒక్క పేపర్‌తప్ప మిగతావన్నీ బాగా వ్రాశానని ఆవిడ చెప్పడం, ఆ ఒక్క పేపర్ ఎక్కడో బయటకు పంపబడడంతో, ఆయన ఆ ఒక్క పేపర్ తప్ప మిగతావాటి మీద శ్రద్ధ తీసుకున్నాడు,

ఫలితం ఆవిడ ఆ ఒక్క సబ్జక్టులో తప్ప అన్నిటిలో నూటికి అరవై మార్కులతో పాసైంది. మార్కుల లిస్ట్ చూసుకున్న అరుంధతి ఆ మార్కులకి ఆశ్చర్యపోయింది. "ఒక్క సబ్జక్టులో పాస్‌మార్కులు వచ్చుంటే ఎంత బాగుండును" అనుకుంది. ఆ మార్కులకి కారణం తన శక్తి సామర్థ్యాలు, పరిశ్రమ కాదని; భర్త పలుకుబడి అని ఆవిడ తెలుసుకోలేదు.

భర్త ప్రమోషన్ మీద స్వంత వూరు ట్రాన్స్‌ఫర్ అవడం, స్వంత ఇంట్లో తిరిగి అడుగు పెట్టడంతో, ఆవిడ ఉత్సాహం పెరిగింది.

వెంటనే ఆ ఏడు పరీక్ష వ్రాయడానికి ఫీజు కట్టింది. సంక్రాంతికి శలవ పెట్టి అమ్మాయి, అల్లుడూ శ్రీనగర్ నుండి వచ్చారు. విద్యాసాగర్ ఎంతో హడావుడి చేసాడు. చుట్టుపక్కల పిల్లలకి ఆటల పోటీలు పెట్టి వాళ్లచే బహుమతు లిప్పించాడు.

ఇల్లంతా మంచి హడావుడిగా వుంది.

రాత్రి ఏడున్నర తర్వాత తీరికగా కూర్చోడానికి అవకాశం దొరికింది అరుంధతికి. వెంటనే పుస్తకాల్ని ముందేసుకు కూర్చుంది.

అప్పుడే ఇరవైనాలుగు గంటలైపోయినా నిన్నటి మీటింగ్ తాలూకు స్మృతులు ఆమెను వెంటాడుతూనే ఉన్నాయి.

"అసలీ సంసారంలో దిగకుండా ఎలాగో పరీక్ష పాసై పైచదువులు చదువుకునుండాల్సింది" అనుకుంది, గతంలోనుండి వర్తమానంలోకి అడుగిడిన అరుంధతి.

క్రితంరోజు మీటింగ్‌లో చకచక ఇంగ్లీషులో మాట్లాడుతున్న మిసెస్ భాటియా, మిసెస్ రామన్; తనకి ఇంగ్లీషు బాగా రాదని పట్టుబడిపోకుండా వుండడంకోసం తిప్పలు పడుతున్న తను; ఆ సన్నివేశం ఆమెకు కళ్లెదుట నిల్చినట్టయింది. సంఘంలో, డబ్బులో, పలుకుబడిలో వాళ్లకన్నా ఎంతో ఉన్నత స్థానంలో ఉన్నా ఆకాసేపు ఎంతో న్యూనతగా ఫీలవ్వాల్సి వచ్చినందుకు, ఆవిడకు ఎక్కడలేని నిస్సత్తువ ఆవరించుకుంది.

నిర్వేదంగా కుర్చీలో వెనక్కివాలి "ఈసారి తప్పకుండా పరీక్ష ప్యాసవ్వాలి" అని తిరిగి మరో మారు గట్టి నిర్ణయం తీసుకుంది.

వెంటనే పుస్తకంలో తలదూర్చింది.

ఈలోగా కర్టెన్ తీసుకుని పిల్లలిద్దరూ లోపలికొచ్చారు.

"అమ్మమ్మా" అంటూ ముందుకు పరుగెత్తుకు రాబోయాడు నాలుగేళ్ల కిషోర్.

"ఏయ్ వెళ్లద్దు" అంటూ అటకాయించింది ఏడేళ్ల పద్మ.

> **గమనిక**
>
> " మినీయింటర్‌వ్యూలు " అనేవి టపాలో వస్తే వాటిని స్వీకరించి వేయడం సాధ్యంకాదని మా యువ పాఠకులకు మనవి ... సం.

"ఏం? నీకేం?" అక్కను పక్కకు నెట్టడానికి ప్రయత్నిస్తున్నాడు వాడు

"అమ్మమ్మ చదువుకుంటోంది. చెడగొడితే నిన్ను నాలుగు తంతుంది."

"ఛీ. ఛీ. ఏం కాదు. ముసలాళ్లెక్కడైనా చదువుకుంటారా ఏం?" నమ్మలేక అడిగాడు వాడు.

"అవున్రా అమ్మమ్మకి పరీక్షలు. చెప్తే వినవేం" ముందుకు వెళ్లబోతున్నవాణ్ణి చెయ్యి పుచ్చుకుని వెనక్కి లాగింది పద్మ.

"ఏ. ఫో. నీవన్నీ కోతలు" అని ఆమెను ప్రక్కకునెట్టి, "ఏం అమ్మమ్మా నిజమేనా?" అంటూ ఆవిడ దగ్గరకెళ్లి ఒళ్లో పడుకుని "నీకు పరీక్షలా? ముసలాళ్లకెక్కడేనా పరీక్షలుంటాయా అమ్మమ్మా?" అని అడిగాడు.

ఆఖరికి నాలుగేళ్ల మనవడుకూడా చులకన చేయడంతో ఆవిడకి కోపం వచ్చింది.

"ఛే" అంటూ విదిలించుకుంది.

"అమ్మమ్మా నన్ను సినిమాకు తీసుకెళ్లవూ?" మారాంగా అడిగాడు. ఆవిడ మాట్లాడలేదు.

ఆవిడ మెడచుట్టూ చేతులేసి, పైకెగబాకుతూ "నన్ను సినిమాకు తీసుకెళ్లు అమ్మమ్మా" అన్నాడు మళ్లీ.

"ఛే" అంటూ వాణ్ణి కోపంగా ప్రక్కకు తోసింది.

దాంతో వాడు ఏడవడం ప్రారంభించాడు.

నోరు తెరుచుకుని, గుడ్లనీరు కుక్కుకుని ఏడుస్తున్నవాణ్ణి చూడగానే ఆవిడకి జాలేసింది.

అంత చిన్న పిల్లాడిమీద కోప్పడ్డందుకు నొచ్చుకుంది.

వెంటనే పుస్తకం టేబిల్‌మీద పారేసి, వాడి దగ్గరకెళ్లి, వాణ్ణి రెండుచేతులతో ఎత్తుకుని ముద్దెట్టుకుంది.

"ఏడవకుబాబూ, ఈ అమ్మమ్మ చాలా మంచిది. కోపం వచ్చినప్పుడు విసుక్కోవడమే కాదు ముద్దు చేస్తుంది, ఆడిస్తుంది, స్వీట్లు కొనిపెడుతుంది, సినిమాకి తీసుకెడుతుంది. నీకేం కావాలంటే అదిచేస్తుంది" అంటూ వాణ్ణి గుండెలకు హత్తుకుని ముద్దుల్లో ముంచింది.

వాడు అన్నీ మరిచిపోయి, నవ్వుతూ కేరింతలు కొట్టసాగాడు.

మల్లెపువ్వులాంటి అమాయకమైన వాడి నవ్వు. ఆమె హృదయంపై పన్నీటిని చిలకరించింది.

కర్టెన్ తీసుకుని లోనికొచ్చిన విద్యాసాగర్ వీళ్లని చూసి నవ్వుకున్నాడు. ఏమీ ఎరుగనట్టు, "అదూ ? అమ్మాయి ఏప్రెల్, మే నెలల్లో మనని శ్రీనగర్ రమ్మంటూంది." అని చెప్పి, నవ్వుతూ "ఓహో నీకు పరీక్షలు కదూ!" అన్నాడు హేళనగా.

ఆనవ్వును చూసిన అరుంధతికి ఒళ్లు మండిపోయింది.

ఆమాట విన్న పిల్లలు, "నువ్వుకూడ మావూరు రా అమ్మమ్మా" అంటూ ఆవిడ కొంగు పట్టుకుని, ఆవిడ చుట్టూ గెంతసాగారు.

విచ్చుకున్న పువ్వుల్లా వున్న ఆ పిల్లల్ని చూసిన, ఆమె మనసు సంతోషంతో నిండిపోయింది.

"నేను తప్పకుండా వస్తాన్రా" అంది, పిల్లల్ని దగ్గరకు తీసుకుంటూ.

విద్యాసాగర్ ఆశ్చర్యపోయాడు.

2—1—76

"అమ్మా! అన్నీ డైనింగ్ టేబిల్‌మీద పెట్టాను. భోంచేద్దామా?" అంటూ శ్యామల లోపలికి వచ్చింది.

శ్యామలక్కూడా రెండు నెలల్లో పరీక్షలు. "దీన్ని ఇంటి పనులకు దూరంగా వుంచి చదువుకోడానికి పూర్తి అవకాశం ఇవ్వాలి" అనుకుంది అరుంధతి తన పరీక్షల గొడవలో పడి, వీళ్ళ గొడవ పట్టించుకోనందుకు చింతించింది.

బయటకు వెళ్ళిన రవి, శీను ఆగదిలో అడుగు పెట్టారు. మళ్ళీ జోకులు, నవ్వులతో వాతావరణం వుల్లాసంగా మారిపోయింది.

దీన్ని చూసిన అరుంధతి, "పరీక్షల కోసం వీళ్ళందరికీ దూరంగా వుంటూ, ఎంతో సరదాగా గడపవలసిన రోజుల్ని ఎంత వృధా చేస్తున్నాను?" అనుకుంది.

(46 వ పేజీ చూడండి)




సినిమా పండిట్స్ ఎన్నో కబుర్లు చెప్తూ వుంటారు. బొమ్మ షూటింగ్ చేస్తున్నప్పుడు వచ్చిన "టాక్" మీద బైస్కోపు తయారై విడుదలైతే చేసే బిజినెస్ గురించి చెప్తామంటారు. "మాస్" అంటారు. "క్లాసు" అంటారు. సినిమా విడుదలైన రోజున వోపెనింగ్స్‌ని బట్టి దాని "హాక్" లేదా "రన్" అంటే ఎన్ని వారాలు అది రికార్డులు పగులగొట్టేది చెప్పేస్తామంటారు. 'క్రిటిక్స్' కూడా అలాగే మాస్ అప్పీలు-క్లాస్ అప్పీలు అంటూ కబుర్లు చెప్తూ వుంటారు. కాని ఈ "పండిట్స్"ని "జనం" అంటే (ప్రేక్షక మహాశయులన్నమాట) ఒక సినిమా థియేటర్ జార్గాన్‌లో ప్యాసింజర్‌లు తల్లక్రిందులు చేస్తూనే వుంటారు. "నార్త్" అంటే హిందీ బొమ్మల ప్రపంచంలో– యీ మధ్య "జై సంతోషిమా" అన్న వో దేవత సినిమా విడుదలైంది అది మామూలు పుక్కిటి పురాణగాథ. "స్టార్ కాస్ట్" లేదు అందులో (ఇదీ సినిమా పరిభాషయే) కాస్ట్యూమ్స్ అంతంత మాత్రమే! కానీ ఆ సినిమా 130 థియేటర్‌లలో అదివరకు వున్న కలక్షన్ రికార్డులను 'ఉఫ్' మని వూదేసిందట? ఈ "బొమ్మ"కి ఆడవాళ్ళు తండోపతండాలుగా వచ్చిచూసి పిల్లలకోసం సంతోషిమాని నోచి, పదేసి రోజుల వ్రతాలు చేసి ప్రసాదాలు థియేటర్లలో పంచుకున్నారట! దీని నిర్మాతకి కూడా యీ "సంతోషిమా"కి ఘన స్వాగతం ఏమిటో అర్థం కావటంలేదుట. అట్లాగా– సినిమా పండిట్స్ అంచనాలు తలక్రిందులై పోతాయి అన్నిచోట్లా...

ముత్యాలముగ్గు ఆల్ టైమ్ సర్‌ప్రయిజ్ సక్సెస్ అన్నారు క్రిటిక్స్ – "క్రిటిక్స్ ఆర్ బేఫిల్డ్" అన్నారు "ఫీల్డు ఎక్స్‌పర్ట్స్"– మరి "జేబుదొంగ"మాటేమిటి? అదీ మూడ్రోజులు ఆడిందే... దాన్లో సెంటిమెంటును లైక్ చేస్తే దీన్లో క్రయిమ్‌ని లవ్ చేశారా? జనం – ఏమో? మళ్లీ సినిమాలమీద మనం ఏం చెప్తాం ... మాస్ పిక్చరేదో, క్లాసు పిక్చరేదో అది విడుదలైన తర్వాత దాని ప్రోఫిట్స్‌ని బట్టి చెప్పాల్సిందే... బాల్కనీలో కూర్చొని సిగరెట్ కాలుస్తూ కాళ్లు ముందు కుర్చీలపై పారేసి మధ్య మధ్య తెనుగు తిట్టు నుడికారపు ఊత పదాలైన "యువర్ మదర్" "యువర్ సిస్టర్"లను ధారాళంగా వాడుతూ "ఫస్ట్ డే" నే బ్లాకు టిక్కెట్‌కొని సిన్మా చూసేవాళ్ళని క్లాసంటామా? మాస్ అంటామా? రూపాయిన్నర టిక్కెట్‌కి సిగ్గుగా మొహమాటంగా వెళ్లి గప్ చిప్‌న సినిమాచూసి యింటికొచ్చిగాని తలనొప్పిగా వుంది. సిన్మా బాగాలేదు అనలేనివాణ్ని మాస్ అంటామా? వైస్ వెర్సావా?... అందుకనే సిన్మాలగురించి ఎవళ్లం ఏం చెప్పలేం... చెప్పగలమా? అని... [వీరాజీ]

## పరిధి

(14వ పేజీ తరువాయి)

ఆదరించువారి అనురాగపు సంసారమే సంసారం అని మా చిన్నప్పుడో పాట ఉండేది"

"అందర్ని ఆదరిస్తే ఇల్లు గుల్లయి పోతుంది"

"నువ్వు పాట సరిగా వినలేదు. అందులో ప్రేమతో దరిజేరిన బంధువుల్ని మాత్రమే ఆదరించమని వుంది. అందర్ని కాదు. మన మీద ప్రేమతో వచ్చేవాళ్ళు మనయిల్లు గుల్ల చెయ్యరు. మనల్ని చేసుకోనివ్వరు"

"ఏమో! నాకు చిన్నప్పటినుండి కూడా బంధువులంటే సదభిప్రాయం లేదు నేను స్నేహితులతోనే ఎక్కువ కలవ గలుగుతాను. స్నేహితుల్ని మనం ఏర్పరచుకోవచ్చు. బంధువులల్లా కాదు. నాకు సుభద్రతో వదినగాకంటె, స్నేహితురాలిగానే ఎక్కువ చనువు"

"స్నేహితుల స్నేహితుల విషయం తీసుకో, వాళ్ళ విషయంలో మనకి ఛాయిస్ లేదు. మనకి నచ్చకపోయినా కొన్నిసార్లు వాళ్ళని భరించక తప్పదు. అల్లాగే స్నేహితుల్లో బోర్‌కొట్టే వాళ్లుండరా?"

"మనకి తెలిసినవాళ్లంతా మన స్నేహితులు కారు. మనకి నచ్చినవాళ్లే మన స్నేహితులు"

"అల్లాగే మనతో చుట్టరికం ఉన్న వారంతా బంధువులు గారు. మనకి నచ్చిన వాళ్ళే మనకి బంధువులు అనుకుంటే పోలా! అల్లాంటి వాళ్లతో రాకపోకలుంటే యేం? వాళ్లనే పోనీ స్నేహితులనుకో"

"బంధువులంటే పెట్టుపోతలుంటాయి బాబూ! అవంటే నాకు భయం"

"పెట్టుపోతలన్నవి మన సాంఘికాచారానికి సంబంధించింది. స్నేహితుల పెళ్లిళ్లకి పుట్టిన రోజులకి శక్తున్నా, లేకపోయినా ఇష్టంఉన్నా లేకపోయినా మనం గిఫ్ట్‌లు తీసుకువెళ్లటం లేదూ? అల్లాగే బంధువుల్తోను"

లక్ష్మి మాట్లాడలేదు. మళ్లీ రఘుయే అన్నాడు "ఈ పెట్టుపోతల్లో ఒక సోషలిజం ఉంది. మా పెదనాయనమ్మ బతికున్న రోజుల్లో మా యింటికి వస్తూ ఉండేది. చచ్చేలా చాకిరి చేసేది. మా నాయనమ్మేమో వాళ్ల అక్కకి తనకున్న దానిలో బట్టలో, వస్తువులో, దినుసులో ఏవో ఆవిడ వెళ్లేటప్పుడు ఇచ్చేది. కొంచెం పచ్చగా ఉన్నవారు తమ పచ్చను, పచ్చగాలేని బంధువులతో పంచుకోడం సోషలిజం కాదా? అయితే ఇది బంధువులమధ్య మాత్రమే అమలు జరుగుతుంది కనక, ఒకళ్ళూ పచ్చగాలేని వర్గాలు దెబ్బతింటూ వచ్చాయి. అందరు పచ్చగా ఉన్న కుటుంబాలు మరీ ధనికులైపోయారు. అందుకనే ఈ సోషలిజం అప్రతిష్టపాలైంది"

"మీ ఆలోచనలువేరు నావివేరు. నా ఆలోచనలు, నేను పుట్టిన నాటి నుంచి పెరిగిన వాతావరణంలో నేను విన్న మాటలు బట్టి ఏర్పడినవి. ఒకరి జోలికి సొంతికి పోకపోడం, మనజోలికి వచ్చేంత చనువు ఎవరికి ఇవ్వకపోవడం చేస్తే, జీవితం చాలా సుఖంగా గడిచిపోతుందని నాకనిపిస్తుంది"

"మనం అంటున్నావ్ మనం అంటే ఎవరు? నువ్వూ, నేనూ మన పిల్లలూనా? మన పిల్లలు పెద్దవాళ్లయ్యాక, వాళ్లకి తల్లి దండ్రులమైన మనల్ని వాళ్ల లిస్టులోంచి తీసేస్తారు. కనుక మన లిస్టులో వాళ్ళని వేసుకున్నా, వాళ్లు మనల్ని వేసుకోరు. ఇంక మిగిలింది నువ్వూ నేనూ. ఇప్పుడు ఆలోచిద్దాం. నన్ను కన్న తల్లి దండ్రులు

నా కుటుంబ పరిధిలోకి రారు. నేను కన్న పిల్లలు నన్ను వాళ్ల పరిధిలోకి రానీయరు. నాతో పుట్టి పెరిగినవాళ్ళు నావాళ్లు కారు. ఇంక కేవలం నన్ను కట్టుకున్న దానిని నువ్వు మిగిలావ్. నువ్వుమాత్రం నా దానివని ఎందు కనుకోవాలి? కేవలం నేను మాత్రమే నా వాడినని ఎందుకనుకోరాదు?''

లక్ష్మికి ఏడుపు వచ్చింది ''నేను మీ దాన్ని కానా? అందర్నీ వదిలేసి మీరే నా సర్వస్వం అని నమ్మివచ్చిన నేను మీకు పరాయిదాన్నా?'' అంది లక్ష్మి ముక్కు ఎగబీలుస్తూ.

'వాదనలో ఉడుక్కోడాల్లేన్. ఆటలో అరిటిపండు. నేను చెప్పేదేమిటంటే కుటుంబపు పరిధిని పెంచుకొంటూపోతే వసుధైక కుటుంబంవైపు ప్రయాణం చేస్తాం. తగ్గించుకొంటూ పోతే ఏదో ఓరోజు నువ్వా? నేనా? అన్న ప్రశ్న వస్తుంది. దానికి సమాధానం ఎప్పుడూ నేనే. అందుకని మనం మన పరిధిని తగ్గించుకొంటూపోవడం నా కిష్టం లేదు అల్లా అని పెంచుకొంటూ పోడానికి తగ్గంత మంచివాడిని కాను. అందుకని నేనంటే అభిమానం చూపించేవాళ్ళు నావాళ్ళు అని నిర్వచించుకొన్నాను.''

''అంటే మీ దుర్గక్కయ్యకి మీరంటే అభిమానం అంటారు. లేక హైదరాబాద్ వచ్చినప్పుడల్లా మీరంటే అభిమానం చూపిస్తుందంటారా?'' అని అడిగింది లక్ష్మి పెంకెగా.

రఘు నవ్వాడు. నవ్వి ''లక్ష్మి నీకో చిన్న కథ చెప్తాను విను. మా తాతగారు మా నాన్నగారి చిన్నప్పుడే పోయారు. మా పెద్దనాన్నగారు అంటే దుర్గవాళ్ల నాన్నగారు తను కష్టపడి చదువుకొని మెట్రిక్ పాసయ్యారు. మెట్రిక్ పాసయి ఉద్యోగంలోజేరి మా నాన్నగారికి ఇంటర్‌దాకా చదువు చెప్పించారు. మా నాన్నగారు ఇంటర్ పాసయి ఉద్యోగంలో జేరాక ఆయన ఉద్యోగం మానుకొని బియ్యే చదివారు. ఆయన బియ్యే పూర్తిచేసి ఉద్యోగంలోజేరి మా నాన్నగారిని ఎమ్మేదాకా చదివించారు. మా దొడ్డమ్మ, మా అమ్మా వాళ్లతో సహకరించబట్టే వాళ్లు పరస్పరం సహాయం చేసుకుంటూ ఇద్దరూ వృద్ధిలోకి వచ్చారు. ఈరోజుల్లో సోషల్ సెక్యూరిటీస్ కొన్నంటూ ఏర్పడ్డాయి. అందుకని బంధువులకున్న విలువ తగ్గింది. పూర్వం బంధువులు కష్టాలొస్తే ఆదుకునేవారు. ఇప్పుడు ఇన్సూరెన్సులు, ప్రావిడెంట్ ఫండులు ఉండటంవల్ల బంధువులనుంచి ఆర్థిక సహాయం పొందవలసిన అవసరం తగ్గింది. అందువల్ల బంధువులంటే మనుషుల ధోరణులు మారాయి. అంతే!''

''మీ అక్కయ్యని హోటల్లో దింపమన్నానని ఎంత లెక్చరిచ్చారండీ! మనింటికే తీసుకు రండి'' అంది లక్ష్మి.

పదో తారీకున లక్ష్మి, రఘు స్టేషన్‌కు వెళ్లారు, దుర్గని, ఆమె భర్తని కలుసుకున్నారు.

''పిల్లలేరి?'' అని అడిగాడు రఘు.

''మా అత్తగారు చూసిపెడ్తానన్నారు'' అంది దుర్గ.

''సెకండ్ హనీమూనింగ్ అన్నమాట'' అన్నాడు రఘు నవ్వుతూ.

రఘు స్టేషన్ బయట తన యింటికి టాక్సీ మాట్లాడబోతుంటే ''మీ బావగారి కంపెనీయే హోటల్ బుక్ చేసింది. కారు పంపుతుంది'' అంది దుర్గ.

''మా యింట్లో దిగకుండా అదేమిటి?'' అని కోపంగా అడిగాడు రఘు.

''నువ్వే చెప్పావ్‌కదా! మాది హనిమూన్ ట్రిప్ అని. మరి మీ యింట్లో దిగితే ఇంక హనిమూనేమిటి నా మొహం? వంటిల్లు నా కప్పచెప్పి 'అక్కయ్యా! లక్ష్మికి పులిహోర చెయ్యడం రాదు. అందుకని నా నోరు చచ్చిపోయింది. కాస్త పులిహోరచెయ్యవా?' అంటూ నువ్వు లక్ష్మిని తీసుకొని వీధిలోకిచెక్కేస్తావ్''

''మేమే వంటింట్లో వుంటాం, నువ్వూ బావగారు రోజూ పది గంటలవరకు చెట్టాపటాలు వేసుకొని షికార్లు కొట్టిరండి, అంతేగాని హోటల్లో దిగుతాం అంటే ఒప్పుకోను''

''మీటింగ్‌కి హోటల్నుంచి వెళ్లటం, సుఖం దగ్గిరాను. పదమూడోతారీకు మీ యింట్లో ఓపూట ఉండి మరీ బెజవాడ వెళ్తాం. సరేనా'' అంది కనకదుర్గ.

ఇంతలో కంపెనీ కారు వచ్చింది. కనకదుర్గ, భర్త అందులో వెళ్లిపోయారు. రఘు మోటార్ సైకిల్ స్టార్ట్ చేశాడు. లక్ష్మి ఎక్కింది. దార్లో ''చూశావా! అత్తగార్ను పిల్లల్నికూడా చూసిపెడ్తారు, అధికారం చెయ్యటమే కాకుండా.'' అన్నాడు రఘు లక్ష్మిని ఉడికించే ఉద్దేశ్యంతో. లక్ష్మి ''నేనత్తగార్ల విషయం మాట్లాడలేదు'' అంది.

పన్నెండో తారీకు వచ్చింది. ఆ మర్నాడు దుర్గ వస్తుంది. అందుకని రఘు, దుర్గకి చీరకొనే ఉద్దేశంతో లక్ష్మిని తీసుకొని గద్వాల్ చీరల కొట్టుకి వెళ్లాడు. దుర్గకి చీర కొంటున్న విషయం, రఘు లక్ష్మికి చెప్పలేదు. అక్కడ లక్ష్మి ''ఈ రంగు నాకిష్టంలేదు'' అంది.

''నీక్కాదు. దుర్గక్కయ్యకి'' అన్నాడు రఘు.

''ఇంటిదగ్గ రెందుకు చెప్పలేదు?''

''చెప్పంటే?''

''ఇక్కడెందుకు చర్చ? ఇక్కడ చర్చించటం నాకిష్టంలేదు.''

''అయితే పద. మళ్లీ వద్దాం.''

అంటూ రఘు చీరకొనకుండా బయటికి దారి తీసాడు. లక్ష్మిని ఎక్కించుకొని, మోటార్ సైకిల్‌మీద టాంక్ బండ్‌కి తీసుకువెళ్లాడు. జనవరి నెలవడంతో అక్కడ చలిగా ఉంది. జనం పలచగా ఉన్నారు. అక్కడ సిమెంటు బెంచిమీద కూర్చున్నాక.

''ఇప్పుడు చెప్పు'' అన్నాడు రఘు.

''దుర్గగారికి మనం ఇంత ఖరీదైన చీర ఇప్పుడు కొనాల్సిన అవసరం ఏమిటి?''

''నాకుద్యోగం అయ్యాక, మా అక్కయ్య నా దగ్గరకి రావటం ఇదే మొదటిసారి. అక్కయ్యకి నేనంటూ ఎప్పుడూ ఒక్క చీరా కొనలేదు.''

''నాకు కొన్నారుకదా పాపం! ఈ

## విరిసిన మమత

ఎద మెత్తనైనపుడు
మది పొరలు విడినపుడు
పుట్టునదె స్నేహమ్ము
పుడమి కపురూపమ్ము.

మమత విరిసిన మనసు
మధురాలు పండించు
స్వాతిశయ తిమిరాల
చంపి సఖ్యము పెంచు.

స్నేహామృతము త్రాగి
సౌహార్దమును పెంచు
దానవత; మానవత
దైవత్వముగ మారు.

— రంగినేని సుబ్రహ్మణ్యం.

మూడేళ్ళలోనూ!"

"కొనలేదా ?"

"కట్టుడు చీరలు కొన్నారు."

"ఖరీదైన చీరలు నీకే యాభయ్యో ఉన్నాయనే ఉద్దేశంతో పెళ్లయ్యాక కొనని మాట నిజమేగాని పెళ్లికి కొన్నాను కదా!"

"పెళ్లికి కొన్న చీరని ఎన్నింటిలో లెక్క పెడ్తారు ?" అని అడిగింది లక్ష్మి.

"ఎన్నింట్లో పెట్టాను ?" అని ఆశ్చర్యంగా అడిగాడు రఘు.

"పెళ్లిలో పెళ్లికూతురికి పెట్టే అయిదు చీరల్లో ఒకటిగా పెట్టారుకదా మీవాళ్లు దాన్ని."

"మేము నీకు అయిదు చీరలు పెడ్తామని అన్నామా ?" రఘు ఇంకా ఆశ్చర్యపోయాడు.

"అనాలేమిటి ? ఆనవాయితీ లేదూ ?"

"ఉందా ? ఉందని ఎవరు చెప్పారు ?"

"సుభద్ర, మా అమ్మ. పెళ్లికి వచ్చిన మా స్నేహితురాళ్లు."

"ఇంకా ఏమన్నా చెప్పరా ?"

"చెప్పలేదు."

"బతికించారు." అప్పటికి రఘుకి కోపం తగ్గి లక్ష్మి అమాయకత్వంమీద జాలి చోటు చేసుకొంది. "విను లక్ష్మీ! కొందరు మొగ పెళ్లివారు పెళ్లికొడుక్కి రిస్టువాచి, పట్టు బట్టలు, ఉంగరం, వెండి కంచం, వెండి చెంబు, వెండి గ్లాసు, మూడో నాలుగో సూట్లు, హనిమూన్‌కి వెళ్లడానికి టిక్కెట్లు, పదివేలు కట్నం అంటూ ఓ పెద్ద జాబితా చదువుతారు. అందుకని మనవాళ్లు ఆనవాయితీలనేవి ఏర్పరచారు. అవి రెండు పక్షాలవారికి రక్షణ కలిపిస్తాయి. ఇన్ని వసూలు చేసిన వాళ్లనుంచి అంతకు ఇంతా ఆడపిల్లకు పెట్టించడంలో ఒక భాగమే అయిదు చీరల ఆనవాయితీ. అయితే ఆనవాయితీల్లో తమాషా ఏమిటంటే ఎవరి మటుకు వాళ్లు వాళ్లకి రావలసినవే గుర్తుంచుకొంటారు. మీవాళ్లు ఆ జాబితాలో నాకు ఎన్ని ఇచ్చారంటావ్ ?"

"మీవాళ్లు అడిగుంటే వాళ్లు ఇచ్చుండేవారు" అంది లక్ష్మి.

"మీవాళ్లు కూడా మమ్మల్ని అయిదు చీరలు పెట్టమని అడగలేదు."

"మీకామాత్రం తెలుసు ననుకొన్నారు. మీరు పెట్టినవికూడా అయిదే ఉన్నాయి."

"అదేదో కాకతాళీయంగా జరిగింది. కాని అందులో ఒకటిమాత్రం నేను అభిమానంతో రెండు వందలు పెట్టి కొన్నాను."

"పోనీ అల్లాగే అనుకొన్నా మరి పెళ్ళయ్యాక ఒకటీ కొనలేదేం ?"

"పెళ్లయిన ఏడాది రెండు కొన్నాను."

"అవి నూలువి."

"గత సంవత్సరం ఒకటి కొన్నాను."

"అది టెర్లిన్."

"ఈ యేడాది కొన్నది."

"అది కాశ్మీర్ సిల్కు."

"మరి ?"

"మీరు మనకి పెళ్లయ్యాక ఒకటైనా గద్వాల్ చీర కొన్నారా ?"

"లేదు."

"నాకు కొనకుండా మరోళ్లకి కొనడం తప్పేనా ?"

"తప్పే."

"ఎప్పుడు దిద్దుకొంటారు ?"

"ఉగాదికి."

"అయితే కొట్టుకి పదండి. రేపొద్దున్నే దుర్గగారు వస్తారుకూడాను."

ఇద్దరు లేచారు. బజారుకి వెళ్లి ఓ చీరా, రవికలగుడ్డ కొని ఇంటికి జేరుకొన్నారు. పక్కమీద పడుకున్నాక రఘు గుండెలమీద రాస్తూ "మా అన్నయ్య కూడా, మీరు దుర్గంటే చూపిస్తున్న అభిమానం, నామీద చూపించాలనే కోరిక, నాకు తీరకపోవడంవల్ల మీరు దుర్గగారికి చీర కొంటానని అనగానే నాకుకలిగిన మొట్టమొదటి భావం అసూయ. అందుకని అల్లా వాదించాను. ఏమనుకోకండి. దుర్గగారంటే నాకు యిష్టమే. ఆవిడ మన పెళ్లికి రికార్డ్ ప్లేయర్ ఇచ్చింది కూడాను" అంది. రఘు లక్ష్మిని ఆప్యాయంగా దగ్గరకు తీసుకొన్నాడు.

"వెర్రిపిల్లా! ఆడూరు కీవూరెంత దూరమో, ఈఊరికి ఆవూరు అంతే." మీ అన్నయ్య కొడుక్కి ఈ మూడేళ్లలోను నువ్వేమన్నా ఇచ్చావా ? లేదు కదా! వాళ్లు ఇవ్వలేదు పుచ్చుకోలేదు" అన్నాడు రఘు.

(ఇంకా వుంది)

# 20th Century Tonic
# JEEVANTONE



TRADE MARK
REGD. NO 21872







# జీవన్‌టోన్

### పచ్చ ఔషధ మూలికలు మద్రాసునందు దొరకనందువలన జీవన్‌టోన్ కంపెనీని బెంగుళూరికి మార్చబడినది

రోగనిరోధక శక్తి, శారీరక బలము, బరువు, అందమైన ఆకారము, స్వచ్ఛమైన రక్తము గలవారి విశేష ఆరోగ్య వంతులుగా ఎంచబడుచున్నారు.

ఆయుర్వేదౌషధముల ప్రభావమును నమ్మనివారు యిప్పటికిని కొందరున్నారు. అట్టివారికి నవాలుగా మేము 'జీవన్ టోన్'ను తయారుచేసియున్నాము.

ఈ బలవర్ధకౌషధము మహిమోపేతమైన గుణములు గలదగుటచే ప్రచారము చేయ పనిలేదు.

'జీవన్ టోన్' హఠాత్తుగా శరీరమునకు బరువును, సౌష్ఠవమును చేకూర్చుటచేత యిది జంతువుల క్రొవ్వు పదార్థము గల్గియున్నదని కొందరు అనుమానించుచున్నారు. అట్టివారికి యిందులో కాయకూరల క్రొవ్వును, మలబముగా దొరకని వనమూలికలు మాత్రమే చేరియున్నవని మనవి చేయుచున్నాము.

**ఈ బలవర్ధకౌషధము యొక్క గుణములు :—** ఆరోగ్యమును, శక్తిని తిర్గి చేకూర్చుట బరువు తగ్గుదలను, అలసటను, వీర్యక్షీణమును పోరాడ నిరోధించును, మరియు మితిమీరిన సంభోగ కార్యమువలన సాధారణముగా గల్గు పరిణామములకు 'జీవన్ టోన్' ఒక మహత్తరమైన టానిక్. దీనిని ఉపయోగించిన కొద్ది రోజులకే దీని మంచి గుణములు తెలియును కావలసిన బరువు, ఆకారసౌష్ఠవము పొందిన తరువాత దీనిని ఉపయోగించుట విడువ వచ్చును. స్థూలశరీరులగు స్త్రీ పురుషులు మాత్రము దీనిని ఉపయోగించరాదు. ఏలనన అదివరకే స్థూలమైన శరీరములకు మరింతకండ, మాంసము పెరిగిన యెడల నిత్యవ్యవహార జీవితమునకే చాల అడ్డంకులు యేర్పడును. స్త్రీలు ప్రసవించిన తరువాత దీనిని వాడవచ్చును ఏ ఋతువునందైనను, ఏ కాలమందైనను నిశ్చితమైన ఆహార నియమము లేకుండగనే ఈ మందును వాడవచ్చును.

**వాడు విధము :—** చెంచాడు టానిక్కు ప్రతిరోజూ ఆహారమునకు ముందు మూడు మారులు. పాలు, పెరుగు, వెన్న వాడకపోయినను మందు గుణము నిచ్చును. వీటినికూడ వాడినచో మందు గుణము రెండింతలు ఎక్కువగును. ఏ జబ్బును లేనివారు దీనిని ఉపయోగించినచో రక్తము మరింత వృద్ధియగును.

వెల, సీసా రు. 14-00 (450 gms.)

*Manufactured by:*

**JEEVAN TONE PRODUCTS**
**Bangalore-560 038**

REACH/J/1/TE

(1) హైదరాబాదు—1 : ఆయుర్వేదిక్ మెడికల్‌హాల్, కోఠీ బస్సుస్టాండు. (2) సికింద్రాబాదు : శారదా స్టోర్స్, 3106, రాష్ట్రపతిరోడ్డు. (3) విజయవాడ : సూర్య మెడికల్‌స్టోర్సు, 1, పార్కురోడ్డు. (4) నెల్లూరు : కె.ఎస్. రావు అండ్ సన్సు. (5) కాకినాడ : లక్ష్మీనారాయణ అండ్ కో. (6) అనకాపల్లి : ఆయుర్వేదిక్ మెడికల్‌స్టోర్సు, మెయిన్‌రోడ్డు. (7) జమ్మిగుంట : రాజేంద్ర మెడికల్ స్టోర్సు, గాంధీచౌక్. (8) విజయవాడ—3: శ్రీ ధనలక్ష్మి మెడికల్ స్టోర్సు. (9) హైదరాబాద్—1 : వసంతా మెడికల్‌స్టోర్సు, కోఠీబ్యాంకు రోడ్డు.

# హైదరాబాద్ నోట్ బుక్

## బాలయోగాచార్యులు

79 సంవత్సరాలు దాటినా ఒక చేత బ్రీఫ్‌కేస్ పట్టుకొని బస్సు కోసం ఉరకలు వేసుకుంటూ, వేళ తప్పక యోగాసనాలు ప్రదర్శిస్తూ, మాటలో, చేతలో, చూపులో వణుకన్నది ఏమాత్రమూ లేని వృద్ధ— కాదు కాదు— బాలయోగాచార్యుడు శ్రీ యశ్వంత్ సిన్హాను చూస్తున్నప్పుడు, ఆదర్శ ప్రాయమైన ఈ గుణాలు నేటి యువకులు అలవరచుకుంటే, మన జాతికి ప్రపంచంలో ఎదు రుంటుందా ? అనిపిస్తుంది. శ్రీ సిన్హా ఏ బీహార్‌వారో కాదు. తల్లావజ్ఝుల వంశీయులు. కృష్ణలీలా తరంగిణితో దేశాన్ని కృష్ణ భక్తితో ముంచెత్తిన నారాయణతీర్థుల వారి 9 వ తరం వారు. ఆయన ప్రాథమిక విద్యాభ్యాసం బాపట్లలో, కళాశాలా విద్యాభ్యాసం జోధ్ పూర్, బరోడాలలో, ఆయన ప్రథమ ప్రపంచ మహా సంగ్రామంలో నౌకాదళంలో చేరి గల్లిపోలి యుద్ధ రంగంలో పాల్గొన్న వీరులు. ద్వితీయ ప్రపంచ సంగ్రామంలో యాంబులెన్స్ బ్రిగేడ్‌లో శిక్షణాధికారులు. నాశిక్ పంచవటిలో చార్ సంప్రదాయ అఖాడా మహంత్ బిహారీదాస్‌జీ శిష్యులుగా యోగ విద్య అభ్యసించారు. ఇక దేహాన్ని నరనరమూ స్వాధీనం చేసుకొన్నారు. కలియుగ భీమ ప్రొఫెసర్ కోడె రామమూర్తిగారి వద్ద రెండేళ్ళు, బరోడాలో శరీర వ్యాయామ మహా విద్వాంసుడు రాజరత్న వై. జి. మానిక్‌రావ్‌గారి వద్ద రెండేండ్లు విశేష శిక్షణ పొందారు. 1931లో కరాచీలో జరిగిన కాంగ్రెస్ మహాసభల వరకు హిందూస్తాన్ సేవాదల్ కమాండరుగా సేవ చేశారు. ఆయన స్వాతంత్ర్య యోధులు, పెక్కుసార్లు కారాగారశిక్ష అనుభవించారు. కాశ్మీర్‌లోని అమర్‌నాథ్ నుంచి టిబెట్‌లోని కైలాస్ మానస్ సరోవర్ వరకు హిమాలయ ఉపత్యకాల్లలో 1490 మైళ్ళు కాలినడకన యాత్ర చేశారు. మాజీ రాష్ట్రపతులు డాక్టర్ రాజేంద్రప్రసాద్, డాక్టర్ రాధాకృష్ణన్, ఆంధ్రప్రదేశ్ గవర్నర్లు, ఇతర ప్రముఖుల సమక్షంలో యోగాసనాలు ప్రదర్శించి మెప్పు పొందారు. పెక్కు ప్రత్యేక సంచికలకు, పత్రికలకు హఠ యోగ విద్యను గురించి పెక్కు వ్యాసాలు వ్రాశారు. ఇంతటి గొప్ప వారు శాసనమండలి మాజీ అధ్యక్షులు శ్రీ గొట్టిపాటి బ్రహ్మయ్య అధ్యక్షతన రవీంద్రభారతిలో సన్మానితులు గావడంలోను, హృషికేశ్‌లో స్వామి శివానంద్ సరస్వతి 'యోగ రత్న' బిరుదంతో సత్కృతులు కావడంలోను విశేషమేముంది? విశేషమంతా బడికి పరుగులు తీసే పిల్లల ఉత్కంఠతో, ఆలస్యమైతే శ్రీ ఎక్కడ

# 20th Century Tonic
# JEEVANTONE



TRADE MARK
REGD. NO 218721







# జీవన్ టోన్

**పచ్చి ఔషధ మూలికలు మద్రాసునందు దొరకనందువలన జీవన్‌టోన్ కంపెనీని బెంగుళూరికి మార్చబడినది**

రోగనిరోధక శక్తి, శారీరక బలము, బరువు, అందమైన ఆకారము, స్వచ్ఛమైన రక్తము గలవారే విశేష ఆరోగ్యశాలులుగా ఎంచబడుచున్నారు.

ఆయుర్వేదౌషధముల ప్రభావమును నమ్మనివారు యిప్పటికి కొందరున్నారు. అట్టివారికి సవాలుగా మేము 'జీవన్ టోన్'ను తయారుచేసియున్నాము.

ఈ బలవర్ధ కౌషధము మహిమోపేతమైన గుణములు గలదగుటచే ప్రచారము చేయబనిలేదు.

'జీవన్ టోన్' హఠాత్తుగా శరీరమునకు బరువును, పౌష్ఠవమును చేకూర్చుటచేత యిది జంతువుల క్రొవ్వు పదార్థము గల్గియున్నదని కొందరు అనుమానించుచున్నారు. అట్టివారికి యిందులో జంతువుల క్రొవ్వును, సులభముగా దొరకని వనమూలికలు మాత్రమే చేరియున్నవని మనవి చేయుచున్నాము.

**ఈ బలవర్ధకౌషధము యొక్క గుణములు :—** ఆరోగ్యమును, శక్తిని వృద్ధి చేకూర్చుట బరువు తగ్గుదలను, అలసటను, వీర్యక్షీణమును పోరాడి నిరోధించును. మరియు మితిమీరిన సంభోగ కార్యమువలన సాధారణముగా గల్గు పరిణామములకు 'జీవన్ టోన్' ఒక మహత్తరమైన టానిక్. దీనిని ఉపయోగించిన కొద్ది రోజులకే దీని మంచి గుణములు తెలియును. కావలసిన బరువు, ఆకారసౌష్ఠవము పొందిన తరువాత దీనిని ఉపయోగించుట నిలుపవచ్చును. స్థూలశరీరులగు స్త్రీ పురుషులు మాత్రము దీనిని ఉపయోగించరాదు. ఎలనన ఇదివరకే స్థూలమైన శరీరములకు మరింతకండ, మాంసము పెరిగిన యెడల నిత్యవ్యవహార జీవితమునకే చాల ఆటంకములు యేర్పడును. స్త్రీలు ప్రసవించిన తరువాత దీనిని వాడవచ్చును. ఏ ఋతువునందైనను, ఏ కాలమందైనను నిర్ణీతమైన ఆహార నియమము లేకుండగనే ఈ మందును వాడవచ్చును.

**వాడు విధము :—** చెమ్చాడు టానిక్కు ప్రతిరోజూ ఆహారమునకు ముందు మూడు మారులు. పాలు, పెరుగు, వెన్న వాడలేపోయినను మందు గుణము నిచ్చును. వీటినికూడ వాడినచో మందు గుణము రెండింతలు ఎక్కువగును. ఏ జబ్బును లేనివారు దీనిని ఉపయోగించినచో రక్తము మరింత వృద్ధియగును.

వెల, సీసా రు. **14-00** **(450 gms.)**

*Manufactured By:*
**JEEVAN TONE PRODUCTS**
**Bangalore-560 038**

REACH/J/1/TE

(1) హైదరాబాదు—1 : ఆయుర్వేదిక్ మెడికల్‌హాల్, కోఠీ బస్సుస్టాండు. (2) సికింద్రాబాదు : శారదా స్టోర్స్, 3106. రాష్ట్రపతిరోడ్డు. (3) విజయవాడ : సూర్య మెడికల్‌స్టోర్సు, 1, పార్కురోడ్డు. (4) నెల్లూరు : కె.ఎస్. రావు అండ్ సన్సు. (5) కాకినాడ : లక్ష్మీనారాయణ అండ్ కో. (6) అనకాపల్లి : ఆయుర్వేదిక్ మెడికల్‌స్టోర్సు, మెయిన్‌రోడ్డు. (7) జెమ్మిగుంట : రాజేంద్ర మెడికల్ స్టోర్సు, గాంధీచౌక్. (8) విజయవాడ—3: శ్రీ ధనలక్ష్మి మెడికల్ స్టోర్సు. (9) హైదరాబాద్—1 : వసంతా మెడికల్‌స్టోర్సు, కోఠీబ్యాంకు రోడ్డు.

# హైదరాబాద్ నోట్ బుక్

## బాలయోగాచార్యులు

79 సంవత్సరాలు దాటినా ఒక చేత బ్రీఫ్‌కేస్ పట్టుకొని బస్సు కోసం ఉరకలు వేసుకుంటూ, వేళ తప్పక యోగాసనాలు ప్రదర్శిస్తూ, మాటలో, చేతలో, చూపులో వణుకన్నది ఏమాత్రమూ లేని వృద్ధ— కాదు కాదు— బాలయోగాచార్యుడు శ్రీ యశ్వంత్ సిన్హాను చూస్తున్నప్పుడు, ఆదర్శప్రాయమైన ఈ గుణాలు నేటి యువకులు అలవరచుకుంటే, మన జాతికి ప్రపంచంలో ఎదురుంటుందా ? అనిపిస్తుంది. శ్రీ సిన్హా ఏ బీహార్‌వారో కాదు. తల్లావజ్ఝల వంశీయులు. కృష్ణలీలా తరంగిణితో దేశాన్ని కృష్ణ భక్తితో ముంచెత్తిన నారాయణతీర్థుల వారి 9 వ తరం వారు. ఆయన ప్రాథమిక విద్యాభ్యాసం బాపట్లలో, కళాశాలా విద్యాభ్యాసం జోధ్‌పూర్, బరోడాలలో, ఆయన ప్రథమ ప్రపంచ మహా సంగ్రామంలో నౌకాదళంలో చేరి గల్లిపోలి యుద్ధ రంగంలో పాల్గొన్న వీరులు. ద్వితీయ ప్రపంచ సంగ్రామంలో యాంబులెన్స్ బ్రిగేడ్‌లో శిక్షణాధికారులు. నాశిక్ పంచవటిలో చార్ సంప్రదాయ అఖాడా మహంత్ బిహారీదాస్‌జీ శిష్యులుగా యోగ విద్య అభ్యసించారు. ఇక దేహాన్ని నరనరమూ స్వాధీనం చేసుకొన్నారు. కలియుగ భీమ ప్రొఫెసర్ కోడె రామమూర్తిగారి వద్ద రెండేళ్ళు, బరోడాలో శరీర వ్యాయామ మహా విద్వాంసుడు రాజరత్న వై. జి. మానిక్‌రావ్‌గారి వద్ద రెండేండ్లు విశేష శిక్షణ పొందారు. 1931లో కరాచీలో జరిగిన కాంగ్రెస్ మహాసభల వరకు హిందూస్థాన్ సేవాదళ్ కమాండరుగా సేవ చేశారు. ఆయన స్వాతంత్ర్య యోధులు, పెక్కుసార్లు కారాగారశిక్ష అనుభవించారు. కాశ్మీర్‌లోని అమర్‌నాథ్ నుంచి టిబెట్‌లోని కైలాస్ మానస్ సరోవర్ వరకు హిమాలయ ఉపత్యకాలలో 1490 మైళ్ళు కాలినడకన యాత్ర చేశారు. మాజీ రాష్ట్ర పతులు డాక్టర్ రాజేంద్రప్రసాద్, డాక్టర్ రాధాకృష్ణన్, ఆంధ్రప్రదేశ్ గవర్నర్లు, ఇతర ప్రముఖుల సమక్షంలో యోగాసనాలు ప్రదర్శించి మెప్పు పొందారు. పెక్కు ప్రత్యేక సంచికలకు, పత్రికలకు హఠయోగ విద్యను గురించి పెక్కు వ్యాసాలు వ్రాశారు. ఇంతటి గొప్ప వారు శాసనమండలి మాజీ అధ్యక్షులు శ్రీ గొట్టిపాటి బ్రహ్మయ్య అధ్యక్షతన రవీంద్రభారతిలో సన్మానితులు గావడంలోను, హృషికేశ్‌లో స్వామి శివానంద్ సరస్వతి 'యోగరత్న' బిరుదంతో సత్కృతులు కావడంలోను విశేషమేముంది? విశేషమంతా బడికి పరుగులు తీసే పిల్లల ఉత్కంఠతో, ఆలస్యమైతే శ్రీ ఎక్కడ

తప్పిపోయి, చుక్క దెబ్బబడుతాయేమోనని పోటీతో యోగవిద్యా ప్రచారానికి ఆయన ఈ వయసులోను అహమహమికతో వెళ్లుతుండడమే. శ్రీ సిన్హా నూరేళ్లూ ఇదే అంగాంగ పటిమతో ఇదే మనో బలంతో యోగవిద్యాప్రచారం చేయాలని, మనసు మర్కటమని గ్రహించి యువకులు ఈ బాల యోగాచార్యులనుండి ఎంతో నేర్చుకుంటారని ఆశిస్తున్నాను.

హరిణవనస్థలి

మహావీర వర్ధంత్యుత్సవాల సందర్భంగా హయాత్ నగర్‌లో స్థాపించబడిన హరిణవనస్థలికి డిసెంబరు 6 వ తేదీన అందమైన కృష్ణ హరిణాల జంటను కేంద్ర వ్యవసాయ శాఖ సహాయమంత్రి శ్రీ ఎ.పి. సింధె లాంచనంగా వదిలారు. హరిణ జాతిలో ఇంత అందమైనవి మరి లేవనుకుంటాను, అన్నారు వాటిని వదులుతూ ఆయన.

లంబాడీల గ్రూపు :

లంబాడీలు, సుగాలీలు, బంజారాలు, అనబడే తెగ ఎప్పుడు దక్షిణా పథానికి, ఉత్తరా పథం నుంచి వచ్చినదోగాని, మన ప్రాంతాలదైపోయింది. ఉప్పు అమ్మడం ప్రధాన వృత్తిగా పూర్వారా తిరగడం వల్ల లంబాడీలు అనే పేరు వచ్చిందను కుంటాను.వారి భాష రాజస్థానీకిసన్నిహితమయిన భాష. వారి అభివృద్ధి మన కర్తవ్యం. ఆంధ్ర ప్రదేశ్ లంబాడీ సంక్షేమ సంఘం అధ్యక్షుడు శ్రీ డి. రవీంద్రనాయక్ నవంబర్ 28న పత్రికా ప్రతినిధులతో అన్నట్టు, ఆంధ్రప్రదేశ్ ఏర్పడి 20 సంవత్సరాలు కావచ్చినా, లంబాడీల విషయంలో రాష్ట్రప్రభుత్వం శ్రద్ధ అంతగా చూపడం లేదనిపిస్తుంది. "ఆంధ్రప్రదేశ్‌లోని పూర్వపు ఆంధ్ర రాష్ట్ర ప్రాంతంలో లంబాడీలను షెడ్యూల్డు జాతులవారిగా పరిగణించి తెలంగాణాలో మాత్రం విముక్త జాతిగా గుర్తించడం అసమంజసం. ఒక తెగ విషయంలో ఒకే రాష్ట్రంలో వేర్వేరు నిబంధనలా?" అంటారు రవీంద్రనాయక్. "మమ్ములను విద్యావంతులను చేయడానికి ప్రభుత్వం ప్రత్యేకంగా ఏ సహాయమూ చేయడంలేదు" అంటున్నారు ఆయన. ఏమైనా లంబాడీలు మన రాష్ట్ర ప్రజలు. వారిని నాయకులు వచ్చినప్పుడు సరదాగా ఎదుట చూపడం కాక, ప్రదర్శన శకటాలపై లెక్కడం కాక, వారిని వారి వ్యక్తిత్వ విశిష్టతలతోపాటుముందుకు తేవలసి ఉంటుంది.

ఉపశ్రుతి :

"చూచారా, బాంగ్‌కాక్‌లో డాక్టర్లు రోగుల నుంచి కృతజ్ఞతగా ప్రతిఫలం పూవులు తప్ప మరేమీ తీసుకోరట. కేరళ మంత్రి స్వయంగా చూచి వచ్చి చెప్పారు." అన్నాను, ఒక డాక్టర్ మిత్రునితో. "మొదట ఆ సంప్రదాయం కమ్యూనిస్టు పరిపాలన వున్న కేరళలో పాటించమని చెప్పండి పత్రికల వారయిన మీరు" అని ఎత్తిపొడిచాడు ఆయన.

— తిరుమల రామచంద్ర



# ఫాల్గుని డైరీ

## అత్తమామల ఆరళ్లు

విల్లుపురానికి చెందిన చిత్తామూరు గ్రామవాసి 38 ఏళ్ల మునుస్వామి మూడుసార్లు వివాహం చేసుకున్నా, ప్రతిసారీ భార్య చనిపోడమేనట నాల్గోసారి దేవకి అనే 28 ఏళ్ల అమ్మాయిని పెళ్లిచేసుకున్నాడట దేవుడు చల్లగా చూసి వీరికి యిద్దరాడపిల్లలు కలిగారట. దేవుడు చల్లగా చూసినా, దేవకిని ఆమె అత్తమామలూ, ఆడబడుచులూ మాత్రం ప్రశాంతంగా వదిలేవారుకాదట. ఆమె ఎంత చెప్పినా భర్త కూడా సహించుకునేవాడుకాదట. ఈ నరకక్షోభ భరించలేక దేవకి తన కూతుళ్లు ఆరేళ్ల సీతాలక్ష్మికి, అయిదేళ్ల గౌరికి యింతింత విషమిచ్చి తానూ ఇంతపుచ్చుకుని జీవితాన్ని అంతం చేసుకున్నదట.

## ఈవ్ టీజర్స్

మద్రాసు పానగల్ పార్కు బస్టాపులో వో బస్సుదిగిన ఒక కాలేజి అమ్మాయితోపాటు వంటో పదముగ్గురు విద్యార్థులు దిగి, ఆమెను వేళాకోళం చేయడమేగాక, అసభ్యమైనమాటలు కూడా అన్నారట. ఇది విన్న పోలీసు వారిని అరెస్టుచేసి కోర్టు ఎదుట హాజరుపరుస్తే కోర్టువారు ఒక్కొ విద్యార్థికి పాతికేసి రూపాయలు అపరాధం విధించారట.

## కుక్కకాటుకు మరణాలు

మనదేశంలో రానురానూ కుక్కకాటుచావులు ఎక్కువవుతున్నాయట ఈ రకం చావులలో ఎక్కువభాగం తమిళనాడులోనూ, అందులో కోయంబత్తూరులో మరీ అధికమట. కోవైపుదూర్ అనేవూళ్లో బి. కాం చదువుకునే వో 17 ఏళ్ల అమ్మాయికి వాళ్లన్నో కుక్కపిల్లను బహూకరించాడట. ఆ కుక్క ఆమెను కరిచిందట. ఇంటికుక్కేకదా అని అంతా అశ్రద్ధ చేశారట. కానీ ఆ కుక్క మూడోనాడు చనిపోయేసరికి భయమేసి, కోయంబత్తూరు సి. యం. సి. ప్రభుత్వ ఆసుపత్రికిఆమెను తీసుకువెళ్లారట. తను అన్నీ మామూలుగానే తింటున్నాననీ, మంచినీళ్లు మాత్రం తాగబుద్ధి గావటంలేదని, ఆ మాట వింటేనే శరీరం ఏదోలా అవుతోందనీ ఆమె డాక్టరుకు చెప్పిందట, డాక్టరు ఆమెకు నిద్రమదిచ్చి, తినడానికి రొట్టెయిచ్చాడట. ఆమె ఆ రొట్టెను యిష్టంగా తిన్నదట. తరువాతామెను హైడ్రోఫోబియా సెల్‌కు తీసుకువెళ్లారట. తెల్లారి ఆమె చనిపోయిందటంతే ! కుక్కకాటుకు మన దేశంలో ఏటా మూడు లక్షలమంది చనిపోతున్నారని, ఇందులో ఒకటిన్నర లక్షలమంది తమిళనాడులో వారేనని మద్రాసు జనరల్ ఆసుపత్రికి చెందిన డాక్టర్ గణేశన్ అన్నారట. విన్నారా! డోన్ట్ బిలీవ్ తమిళనాడూస్ డాగ్ ! !

## పరాభవం

బస్తీకి చెందిన వో పాతికేళ్ల కుర్రాడు తిక్కపుట్టి వో చిన్న పిల్లను బలాత్కరించబోయాడట. ఆ నేరానికిఆ వూరివారంతా కలసి కుర్రాడి ముఖం నిండా రంగులు పులిమి, గాడిదమీద ఎక్కించి వూరంతా వూరేగించారట.

## జైమినీవద్ద నల్లధనం లేదుట

తన ఇంట్లో 22 లక్షల రూపాయల నల్లధనం ప్రభుత్వాధికారులు పట్టుకున్నారని కొన్ని పత్రికలు రాశాయని, ఇది సుద్ద అబద్ధమని మద్రాసులో వో సభలో మాట్లాడుతూ నటుడు జైమినీ గణేశన్ అన్నారట.

## భార్యని చంపించిన అనుమానం

ధర్మపురికి చెందిన ఒక వూళ్లో వేలుస్వామి అనే అతని భార్య వళ్లియమ్మాల్ పురిటికి పుట్టింటికి వెళ్లి పురుడయ్యాక కూడా ఒళ్లు బాగులేదని, మందుతీసుకుంటున్నాననీ చెప్తూ, నెలల తరబడి భర్తను సాగనంపుతూ వచ్చిందట. ఒకసారి అత్తారూరు వెళ్లిన వేలుస్వామికోపం వచ్చి భార్య మెళ్లోతాళి తెంపి పొయ్యిలో పారేసి పోయాడట. మరి కొన్నాళ్లాగి మళ్లీవచ్చి తాను డాక్టరుతో మాట్లాడి వచ్చానని, అదే వూళ్లో డాక్టరుకు చూపిస్తాను రమ్మనీ భార్యని అడిగారుట. ఆమె సరేనని అతనితో బయల్దేరిందట. దారిలో మాటమీదమాటవచ్చి, రగడ పెరిగిందట. వేలుస్వామి కోపంతో భార్యను రోడ్డుమీద క్రిందపడేలాతోసి, రాళ్లేసికొట్టి,మొలలోంచి కత్తితీసి పీకమీద పొడిచి, ఆమెను చంపి, నేరుగా పోలీస్ స్టేషనుకు వెళ్లి లొంగిపోయాడట. భార్య శీలంమీద అతనికి అనుమానమట.

## అరెస్టయిన నగ్న నర్తకులు

తిరుచ్చిలో వో హోటలులో గానా, బజానా, మటీ జరుగుతుండగా పోలీసులు హటాత్తుగా ఆ హోటలుమీద (ఎవ్వో అందుకార్యుడు) విరుచుకు పడ్డారట. దాంతో వారికి నగ్నంగా నృత్యం పేర ఒళ్ళు చూపడమే గాక, వ్యభిచారం చేస్తున్న ఏనమండుగురు నగ్నసుందరులు దొరికారట. హావ్వుయ్ విష్ టు బీ ఎ పోలీస్ బేర్!!

## తీగ లాగితే...

నాగపట్టణంలో వో ఉత్సాహవంతుడు నగరమంతా మాటుమణిగినా తిరుగుతూనే ఉండడం చూసి పోలీసులు పిలుచుకపోయి, విచారించి చూసి అతను తమిళనాడులోనిఅన్ని పెద్ద వూళ్ళల్లోను చక్కని దొంగతనాలు చేసిన ఘనుడనీ, అప్పటికే ముప్పయిరెండు సార్లు జైలు రుచి చూసిన వాడేననీ తెలిసిందట. అనక..... ఏమవుతుంది! ముప్పయిమూడోసారీ వెళ్ళాండు.

## కడుపునొప్పికి ఆత్మహత్య

తంజావూరుకు చెందిన కళియ పెరుమాల్ అనే అతని 18 ఏళ్ళ కుతూరు వసంత తన కడుపునొప్పిని భరించలేక, అది పోయే మార్గం లేక, విసుగెత్తి, ఆత్మహత్య చేసుకున్నదట.

## ఏవి పాలు ఏవి కావు ?

నాకో యాభయి రూపాయలిస్తే నువ్వు ఎన్ని పాలలో ఎన్ని నీళ్ళు కలుపుకున్నా చూసి చూణ్ణట్టుంటానని సాత్తూరులోని శ్రీనివాసన్ అనే వో అధికారి నమ్మాళ్వార్ అనే వో పాల వ్యాపారితో బేరం పెట్టాడట. అలాగే అన్న ఆ నమ్మాళ్వార్ ఈ విషయం "లంచ నిర్మూలన శాఖ"కు తెలియజేశాడట. వో అధికారి మామూలు దుస్తులతో నమ్మాళ్వార్‌తో కలిసి వెళ్ళి ఆ లంచం ఇవ్వడం వగయిరా పూర్తయ్యాక తక్కున శ్రీనివాసన్ను అరెస్టు చేశాడట.

## ఎమ్.జి టు బీజి

మీటరు గేజి మార్గాన్ని బ్రాడ్‌గేజి మార్గంగ మార్చడానికి (లేక బ్రాడ్ గేజి మార్గం కొత్తగా వేసినాసరే) కిలో మీటరు ఒక్కంటికి పద్దెనిమిది లక్షల రూపాయలు ఖర్చవుతుందని రైల్వే శాఖ మంత్రిగారన్నారట— వాట్!! నమ్మబుల్ కాదా!

## కొమ్మచేసిన చేటు

వాలపార్టైకు చెందిన 22 ఏళ్ళ షణ్ముగం అనే కుర్రాడికి అతని తలిదండ్రులు పెళ్ళి నిశ్చయించి ముహూర్తం పెట్టేశారట. తన పెళ్ళికి వంట చెరకు కోసం అడివికి వెళ్ళి, వో చెట్టుకొమ్మని నరికితే అది విరిగి షణ్ముగం తలమీదే పడిందట. దాంతో అతను అక్కడికక్కడే చనిపోయాడట.

# అరుంధతీ ఆంధ్రామెట్రిక్

(37వ పేజీ తరువాయి)

“వీళ్ళందర్నీ కష్టపెట్టి, ఆంధ్రామెట్రిక్ పాసై ఏంచెయ్యాలి ?” అని తనను తాను ప్రశ్నించుకుంది.

గాలి రివ్వున వీచింది. హిందూదేశ చరిత్రలో మరికొన్ని పుటలు తిరగబడ్డాయి.

“ఇప్పుడు నాకేంలోటు ? ప్రేమున్న భర్త కన్నుల పండువగావున్న ఇల్లు, కీర్తిని పెంచే పిల్లలు. వీటిని మించిన సౌఖ్యం ఏముంది ? ఇప్పుడు చచ్చీచెడీ చదివి, పిల్లల, భర్త, సరదాలు పోగొట్టి పరీక్షలు పాసై చేసేదేముంది ?” అనుకుంది అరుంధతి.

వీచేగాలికి, హిందూదేశ చరిత్ర, జరుగుతున్న చరిత్రను తనలో ఇముడ్చుకోడానికా, అన్నట్టు మూసుకుంది.



ఇతన్ని ఎందరో హైదరాబాదులో వీధులలో చూసి ఉంటారు. ఎక్కువగా ఒక బండీలో లేదా చెత్త కుండీలలో కూర్చుని కనిపించే ఇతనిపేరు “వెంకన్న”; అయితే “నన్ను రెడ్డి అనికూడా పిలుస్తారు” అని అతను అంటాడు. వెంకన్నకి తలిదండ్రులు లేరు. అమ్మమ్మతో బంజారా హిల్స్ ప్రాంతంలో ఒక గుడిసెలో ఉంటూఉంటాడు. ఆమె కూడా ఈ వృత్తినే అనుసరిస్తోందట. తన వయసు ఇరవయికంటే ఉండదని రెడ్డి నమ్మకం. అతనికి రోజుకి నాలుగయిదు రూపాయలు వస్తాయిట. అతనికి తోడు పడే ఇద్దరు అబ్బాయిలూ అతని మామ కొడుకులు.........

(ఫోటో, మాటలు : శ్రీధర్)







Printed and Published by S. NageswaraRao at the Andhra Patrika press, MallikarjunaRao Street, Gandhinagar, Vijayawada-3. Editor; S. Radhakrishna